# యరోడా జైలు నుండి

రచన :

గాంధీజీ



అనువాదము :

శ్రీ నండూరి వెంకటకృష్ణమాచారి

గాంధీ సాహిత్య ప్రచురణాలయము

(గాంధీ స్మారకనిధి, ఆంధ్రశాఖ)

రామారావుపేట, కాకినాడ

# తొలిపలుకు

ఉప్పు సత్యాగ్రహము ప్రారంభించిన పిమ్మట మహాత్ముడు పూనాలోని యరోడా జైలులో నిర్బంధింపబడెను. ఈ లేఖలను ఆయన జైలులోనుండి సత్యాగ్రహ ఆశ్రమవాసులపేర గుజరాతీ భాషలో వ్రాసెను. అవి హిందీ భాషలోనికి, ఇంగ్లీషు భాషలోనికి, తదితర భాషలలోనికి, అనువాదము చేయబడినవి. ఈ తెలుగు అనువాదము హిందీ, ఇంగ్లీషు అనువాదముల సహాయముతో సిద్ధము చేయబడినది.

గాంధీ స్మారకనిధి, ఆంధ్రశాఖవారిచే నెలకొల్పబడిన గాంధీ సాహిత్య ప్రచురణాలయము కృషి ఫలితముగా ఢిల్లీ దినచర్య, నా మతము, మన గ్రామ పునర్నిర్మాణము, నూతన విద్యావిధానము, అంటు దిస్ లాస్ట్, సర్వోదయము ఇదివరలో తెలుగులోనికి అనువదింపబడినవి. ఇది ఏడవ ప్రచురణ. దీనిని ఆంధ్రప్రజానీకము ఆదరింపగలరని మా విశ్వాసము.

— ప్రకాశకులు

# ఉపోద్ఘాతము

1930 లో నన్ను యరోడా సెంట్రల్ జైలునందు నిర్బంధించి నపుడు ముఖ్యమైన ఆశ్రమ దీక్షలనుగూర్చి చర్చించుచు ప్రతివారము ఆశ్రమవాసులకు ఉత్తరములు వ్రాయుచుంటిని. ఆశ్రమము యొక్క ప్రభావము దాని భౌగోళిక సరిహద్దులదాటి పయనించి యుండుటచే, యీ ఉత్తరముల నకళ్ళ సంఖ్య పెరుగసాగినది. అవి గుజరాతీలో వ్రాయబడినవి. వానిని ఇంగ్లీషు, హిందీ, తదితర దేశభాషలలోనికి అనువాదము చేయవలెనని ప్రజలు కోరిరి. శ్రీ వ్జాలీ దేశాయ్ దాదాపు పరిపూర్ణమైన అనువాదము చేసిరి; కాని యీ నిర్బంధ ములో నాకు కొంతవరకు తీరికయున్నదని చూచి పునర్విమర్శ చేయు టకు నాకు పంపిరి. నేను దానిని చదివి నాకు నచ్చిన రీతిగా, నా అభిప్రాయము వ్యక్తమగునటుల చాల చోట్ల మార్పులు చేసితిని. ఆంగ్ల పాఠకుల కొఱకు నేను తిరిగి వ్రాయవలసివచ్చిన, సంపూర్ణముగా కొత్త విషయము వ్రాయవలసియుండును. నేను 1930 లో ఆశ్రమ వాసులకు వ్యక్తపరచిన అభిప్రాయ వైఖరియే ఆ పాఠకునకుగూడ ఉండాలి. అందువలన అసలు చర్చలో చాల తక్కువ మార్పులు చేసినాను.

యరోడా సెంట్రల్ జైలు
6 మార్చి 1932

ఎమ్. కె. గాంధి

# విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. సత్యము | ... | 1 |
| 2. అహింస | ... | 5 |
| 3. బ్రహ్మచర్యము | ... | 10 |
| 4. అస్వాదము | ... | 15 |
| 5. అస్తేయము | ... | 21 |
| 6. అపరిగ్రహము | ... | 26 |
| 7. అభయము | ... | 30 |
| 8. అస్పృశ్యతా నివారణము | ... | 34 |
| 9. కాయకష్టము | ... | 38 |
| 10. సర్వధర్మ సమానత్వము | ... | 42 |
| 11. సర్వధర్మసమభావము | ... | 46 |
| 12. వినయము లేక నమ్రత | ... | 50 |
| 13. స్వదేశీవ్రతము | ... | 55 |
| 14. స్వదేశీవ్రతము | ... | 55 |
| 15. వ్రతముల ఆవశ్యకత | ... | 60 |
| 16, యజ్ఞము | ... | 65 |
| 17. యజ్ఞము | ... | 68 |

# సత్యము

మన సంస్థయొక్క మూలమే సత్యాగ్రహము—అనగా సత్యనిష్ఠ. కావున మొట్టమొదట నేను సత్యమును గురించి వ్రాసెదను.

సత్యశబ్దము 'సత్' అను ధాతువునుండి ఏర్పడినది. సత్ నకు ఉండునది లేక అస్తిత్వము గలది అని అర్థము. సత్యము తప్పి ఉండునది ఇంకేదియులేదు. పరమేశ్వరుని నిజమైన పేరు 'సత్' అనగా సత్యము. అందుచేత పరమేశ్వరుడు సత్యమనుటకంటె సత్యమే పరమేశ్వరుడనుట ఎక్కువ తగియుండును. పాలించు రాజులుగాని, నడుపు సర్దారులుగాని లేకుండ మన వ్యవహారములు కొనసాగజాలవు. అందువల్ల పరమేశ్వరునకు, రాజులకు రాజు మొదలైన పేర్లు ప్రచారములో ఉన్నవి. అవి ముందునకు కూడ ఉండగలవు. కాని లోతుగ ఆలోచించినచో 'సత్' లేదా సత్యమే పరమేశ్వరునకు సరియైన పేరు. అర్థమును పూర్తిగ ప్రకటించునది కూడ అదియే.

సత్యమున్నచోట జ్ఞానము అనగా శుద్ధజ్ఞానము తప్పక ఉండును. సత్యము లేనిచోట పరిశుద్ధజ్ఞాన ముండజాలదు. కావుననే 'సత్' అను ఈశ్వరుని పేరుతో 'చిత్' (అనగా జ్ఞానము) శబ్దము కూడ అంటిఉండును. సత్యమైన జ్ఞానముండుచోట ఆనందముండుట తప్పదు. శోకము ఉండనే ఉండజాలదు. సత్యము శాశ్వతమైనందువల్ల ఆనందము

కూడా శాశ్వతముగా ఉండును. అందుచేత ఈశ్వరుని 'సచ్చిదానంద' మను పేరుతో కూడ మనము తెలిసికొందుము.

ఈ సత్యమును ఆరాధించుటకొరకే మన జీవితములు. మన కార్యకలాపము లన్నియు అందుకొరకే. మన శ్వాసోచ్ఛ్వాసములు కూడ అందుకొరకే. ఇట్లు చేయుట నేర్చిన పిమ్మట ఇతర నియమము లన్నియు సహజముగ నే–వే శ్రమ పడకుండగనే మన వశములోనికి వచ్చును. వాటిని పాలించుటకూడ సులభముకావచ్చును. సత్యమును వదలి ఇంకే నియమమునైనను సరిగా పాలించుట అశక్యమైన పని.

సాధారణముగ– సత్యమును చెప్పుటనే సత్యముయొక్క అర్థమనుకొనెదరు. కావున నేనీ శబ్దమును ఆ అర్థములో గాక విశాలార్థములోనే ప్రయోగించినాను. ఆ అర్థములో సత్య మన– మనోవాక్కాయ కర్మలలో సత్యముగ నుండుటయే. యావత్తు జ్ఞానము సత్యములోనే ఇమిడి ఉన్నదని పైన నేను చెప్పినాను. కావున సత్యమును సంపూర్ణముగ తెలిసికొన్న వానికి తెలిసికొనవలసిన దేదియు జగత్తులో మిగిలి ఉండదు. దానిలో ఇమిడి ఉండనిది సత్యము కాదు. జ్ఞానము కాదు. అట్టి దానివల్ల నిజమైన ఆనందమెట్లు లభించగలదు? ఈ ఒరపిడి రాతిని ఉపయోగించుటను మనము నేర్చికొనినచో– చేయదగినపని ఏదో చేయరానిదేదో, చూడవలసినదేదో, చూడరానిదేదో, చదువవలసినదేదో– చదువరానిదేదో తెలిసికొనుటలో ఆలస్య ముండజాలదు.

పరసువేదివంటి, కామధేనువు వంటి ఈ సత్యమును బడయుటెట్లను ప్రశ్నకు– "అభ్యాసము వల్లను, వైరాగ్యము వల్ల"నని భగవానుడు జవాబు చెప్పినాడు. అభ్యాస మనగా సత్యముతో కలిసిపోవుటయే. దానియందే తక్క అన్యవస్తువులయెడ అత్యంతమైన ఉదాసీనత కలిగియుండుటయే వైరాగ్యము. అప్పటికిని ఒకరికి సత్యమైనది ఇంకొకరికి అసత్యముగా కనుపించవచ్చును. కాని దాని విషయమై బాధపడ వలసిన పనిలేదు. ప్రయత్నము పరిశుద్ధమైనదైనచో– అట్లు భిన్నములుగా కనబడు సత్యములన్నియు కూడ ఒకే చెట్టు యొక్క అసంఖ్యాకములును, భిన్నములును అయిన ఆకుల వలె గన్పించగలవు. ప్రతి మనిషికిని పరమేశ్వరుడే వేర్వేరుగ కనబడుటలేదా? అయినను ఆయన ఒక్కడే అని మన మెఱుంగుదుము. కాని సత్యమే పరమేశ్వరుని పేరైనప్పుడు– ఎవరికి ఏది సత్యమని తోచిన దాని ప్రకారము నడచుకొనుటలో తప్పేమి లేదు. అంతేకాదు. అట్లు నడచుటయే వారి కర్తవ్యము. అందులో పొరపాటున్నచో కూడ– అది తప్పకుండ దిద్దుబాటు కాగలదు. సత్యాన్వేషణలో తపశ్చర్య ఇమిడి యున్నది. తపశ్చర్య అనగా కష్టసహనమే. ఒకప్పుడు ఆ కష్టసహనము చావునకు దారితీయవచ్చును. అందుచేత అందులో స్వార్థమను వాసనకూడ ఉండజాలదు. నిస్వార్థమైన అట్టి సత్యాన్వేషణలో బడినవాడెవ్వడు– తుదివరకు తప్పు దారిలో పోవుట నేటివరకు జరుగలేదు. త్రోవతప్పి, తిరిగి, ఎదురు దెబ్బలుతిని, తిరిగి సరియైన మార్గములో నడక సాగించగలడు.

సత్యమును ఆరాధించుటయే భక్తి. మరి భక్తి అన్ననో నిత్యము ప్రాణార్పణ చేయుటకు సిద్ధముగ నుండుటయే. పరమేశ్వరుని కడకు పోవుమార్గ మదియే. అందులో పిరికి తనమునకు తావులేదు. దానిలో ఓటమి అన్న వస్తువేదియు లేదు. మృత్యువుద్వారా అమృతత్వమునకు పోవు మంత్ర మది.

మనమిప్పుడు దాదాపుగ అహింసయొక్క పొలిమేరకు చేరినాము. దాని విషయమై వచ్చేవారము విచారించెదను.

ఈ సందర్భములో మనము- హరిశ్చంద్రుడు, ప్రహ్లాదుడు, శ్రీరామచంద్రుడు- ఇమామ్ (మతగురువులు) హసన్ హుసేనులు, క్రైస్తవభక్తులు మొదలగు వారి జీవితములను గురించి యోచించుట చాల మంచిది. వచ్చేవారము వరకు పిన్నలు పెద్దలు, స్త్రీలు పురుషులు అందరును కూడ నడచుచు, తిరుగుచు, లేచుచు- కూర్చొనుచు, తినుచు- త్రాగుచు, ఆడుచు- పాడుచు వేయేల అన్నివేళల ఈ సత్యమునే జపించుచు రాత్రి నిర్మలమైన నిద్రపోవుచుండినచో ఎంత బాగుండును. సత్యరూపియైన ఈ పరమేశ్వరుడు నా పాలిటికి చింతామణి యైనాడు. అందరికిని కూడ ఆయన అట్లే యగుగాక.



# 2

## అహింస

సత్య, అహింసల మార్గము ఎంతస్ఫూటియైనదో అంత ఇరుకైనదికూడ. కత్తిమొనమీద నడచుట వంటిది. చూపు చెదరనీక, మెలకువతో దొమ్మరివాడు నడిచిపోవు త్రాటి కంటె కూడ సత్య, అహింసలనే త్రాడు సన్నమైనది. కొంచెము పొరబడినచో చాలు — క్రిందబడుటయే జరుగును. అనుక్షణము సాధన చేయుటవల్లనే దాని దర్శనము లభించ గలదు. కాని ఈ శరీరముతో సత్యమును సంపూర్ణముగ దర్శించుట సంభవముకాదు. దాని విషయమై కేవలము ఊహించుకొనగలము. క్షణభంగురమైన ఈ దేహముద్వారా శాశ్వతమైన ధర్మమును సాక్షాత్కరింప జేసికొనుట అసంభవము. కావున తుదకు శ్రద్ధలేక నమ్మకముమీదనే మనము ఆధారపడవలసి ఉండును.

ఈ కారణమువల్లనే జిజ్ఞాసువు అహింసను అండగా తీసికొనవలసి వచ్చినది. తన మార్గములో వచ్చు సంకటములను సహించుటయా లేక వాటిలో నాశనము చేయవలసిన వాటిని నాశనము చేసికొనుచు ముందునకు సాగిపోవుటా అన్న ప్రశ్న జిజ్ఞాసువు నెదుర్కొనినది. నాశనము చేసికొనుచు పోయినచో—ముందునకు సాగిపోవుటకు బదులు ఎక్కడివాడు అక్కడనే ఉండిపోవుట జరుగుచున్నదని అతడు తెలిసికొన్నాడు. సంకటములను సహించినచో ముందునకు సాగిపో వచ్చునని గ్రహించినాడు. అంతేగాక తాను వెదకుచున్న

సత్యము బైటలేదని లోననేగలదని- మొట్టమొదట తాను చేసిన నాశనమువల్ల తెలిసికొన్నాడు. అందుచేత నాశనము నకు పూనుకొన్నకొలది తాను వెనుకబడిపోవు చున్నానని సత్యము తనకు దూరమగు చున్నదని ఆతడు గ్రహించినాడు.

దొంగలు మనలను బాధించినప్పుడు వారినుండి తప్పించుకొనుటకు మనము వారలను దండించెదము. అందు వల్ల వారు మనలను వదిలిపోవుట తప్పక జరుగును. కాని మనలను వదలి వారు ఇంకొక చోటునకు పోయి కన్నము వేయుదురు. ఆ ఇంకొకచోటనున్నవారు కూడ మనవంటి వారలే గదా! దొంగలను మనము వదల్చుకొని మనవంటి వారైన ఇంకొకరిమీద ప్రయోగించితిమన్నమాట. మనము చేసినదానివల్ల దొంగల సమస్య పరిష్కరింపబడలేదని దీని కర్థము. దొంగ, దొంగతనమే తన పనిగా పెట్టుకొనుటవల్ల, దొంగలబాధ హెచ్చిపోవును. అందుచేత దండించుటకంటె దొంగలబాధను సహించుటయే మంచిమార్గము. దానివల్ల దొంగకు బుద్ధిరావచ్చును. అతని బాధను సహించుటవల్ల దొంగ మనకంటె భిన్నుడైన వాడెవ్వడో కాడని మనకు తెలిసివచ్చును. మనకు ఎల్లరు బంధువులే. ఎల్లరు స్నేహి తులే. కావున వారిని శిక్షించవలసిన అవసరములేదు. కాని వారి బాధను సహించి ఊరుకొనుట చాలదు. అందువల్ల పిరికితనము రాగలదు. ఈ ఆలోచనవల్ల దొంగలపట్ల మనకు గల ధర్మము మనకు గోచరమగును. దొంగను మనము సోదరునిగనో బంధువునిగనో ఎంచినచో, ఆతనిలో మన మా

భావమును రేకెత్తించవలెను. అతనిని మనవానిగ చేసికొను టకు తగిన ఉపాయములను మనము కనుగొనునంతవరకు అతని బాధను సహించుటకు మనము సిద్ధముగ నుండవలెను. ఇదే అహింస చూపించు మార్గము. దీనివల్ల ఉత్తరోత్తర మనము ఎక్కువ దుఃఖమును సహింపవలసివచ్చును. తద్వారా అఖండ ధైర్యమన్న నేమిటో గ్రహించుటలో మనకు మంచి శిక్షణ లభించగలదు. ఈ మార్గమునవలంబించినచో చివరకు దొంగ సాహుకారు కాగలడు. సత్యమును మనమిదివరకటి కంటె ఎక్కువ స్పష్టముగ దర్శింపగలము. ఈ రీతిగ పోయి నచో జగత్తును మన మిత్రముగా చేసికొనుట నేర్చుకొనె దము. ఈశ్వరమహిమను, సత్యమహిమను అధికముగ తెలిసి కొనగల్గుదుము. సంకటములను సహించుటవల్ల శాంతి సౌఖ్య ములు వృద్ధికాగలవు. ధైర్యసాహసములు కూడ వృద్ధికా గలవు. శాశ్వతములైనవాటికిని, అశాశ్వతములైనవాటికిని మధ్యగల భేదమును బాగుగ గుర్తించగలుగుదుము. కర్తవ్యా కర్తవ్యముల వివేకము మనకు కలుగును. గర్వము కరిగిపో వును లేక నశించిపోవును. నమ్రత ఎక్కువగును. పరిగ్రహ బుద్ధి దానంతటదే తగ్గిపోవును. దేహములో నిండియున్న మైల దినదినమునకు తగ్గిపోవుచుండును.

ఈ అహింస— ఈనాడు మన దృష్టిలో ఉన్న లేక మన మనుకొనుచున్న అహింసవంటిది కాదు. లేక స్థూల మైన వస్తువువంటిది కాదు. ఎవ్వరిని కొట్టగూడదు, చంప గూడదన్నది కూడ అహింసలో భాగమే. కాని చెడుతలంపు

కూడ హింసే. తొందరపాటు హింసే. మిథ్యాభాషణము కూడ హింసే. ద్వేషము హింసే, ఎవ్వరికైన చెడుగోరుట హింసే, లోకమునకు అవసరమైన వస్తువులను స్వాధీనములో ఉంచుకొనుటకూడ హింసే. కాని మనము తిను తిండికూడ లోకమునకు అవసరమైనదే. మనము నిలుచుండుచోట ఉన్న వందలకొలది సూక్ష్మజీవులు మన పాదముల క్రిందబడి నలిగి పోవుచున్నవి. మనము నిలిచిఉండు చోటు ఆ సూక్ష్మజీవులదే. అయిన గతిఏమి? మనము ఆత్మహత్య చేసికొనవలసినదేనా? దానివల్ల కూడ లాభములేదు. మన ఆలోచనలలో మనము దేహాసక్తిని వదలినచో తుదకు దేహము మనలను వదలిపోవును. మోహరహితమైన ఈ స్వరూపమే సత్యనారాయణుడు. ఈ సత్యనారాయణ దర్శనము ధైర్యము వీడిన దొరుకదు. ఈ దేహము మనది కాదనియు, ఇది మనవద్ద తాకట్టుపెట్టబడిన వస్తువనియు గ్రహించి, దీనిని ఉపయోగించుకొనుచు మనము ముందుకు సాగిపోవలెను.

ఈ విషయమును అందరకును సులభముగ అర్థమగునట్లు నేను వ్రాయకోరినాను. కాని కఠినమైపోయినది. అయినను, అహింసను గూర్చి ఏ మాత్రమైన ఆలోచించినవారికెవ్వరికైనను దీనిని అర్థము చేసికొనుటలో ఏ విధమైన కష్టము కలుగజాలదు.

అహింస వినా సత్యాన్వేషణ అసంభవమని మాత్రము అందరును తెలిసికొనవలెను. సత్యాహింసలు నాణెముయొక్క

రెండు ప్రక్కలవలె, గుండ్రని లోహపు బిళ్లయొక్క రెండు వైపులవలె, పడుగు పేకలవలె ఒకదానితో ఒకటి విడదీయ రానంతగ కలిసిపోయినవి. ఆ రెండు ప్రక్కలలో దేనిని క్రిందదనవలెనో, దేన్నిని మీదదనవలెనో ఎవ్వరు చెప్పగలరు? అయినప్పటికిని అహింసను సాధనముగను, సత్యమును సాధ్యము అనగా సాధింపవలసిన దానిగను అంగీకరింప వలెను. సాధనము మన చేతిలోని విషయము. అందుచేతనే అహింస పరమధర్మముగ చెప్పబడినది. సత్యమే పరమేశ్వరుడు. కావున మనము సాధనము విషయమై ఆలోచించు చుండినచో ఏదో ఒక రోజున సాధ్యముయొక్క దర్శనము గావింపగలము. ఇంతమాత్రము నిశ్చయించుకొను టన్న జగత్తును జయించుటయే. మన మార్గములో ఎన్ని సంకటములు వచ్చిపడినను, బాహ్యదృష్టికి లేక లోకమునకు మన మెన్ని మారులు ఓడిపోయినట్లు కనపించినను, మనము మాత్రము— "సత్యమే ఉండునది. అది ఒక్కటే ఉండునది. అది ఒక్కటే పరమేశ్వరుడు. దానిని సాక్షాత్కరింపజేసికొనుటకు ఒక్కటే మార్గము. ఒక్కటే సాధనము. అదియే అహింస. దాని నెన్నటికిని వదలిపెట్టము. సత్యస్వరూపుడైన ఏ పరమేశ్వరునిపేర ఈ ప్రతిజ్ఞ చేసితిమో ఆ పరమేశ్వరుడే దీనిని పాలించుటకు వలయు బలమును మాకు ప్రసాదించుగాక" అన్నదానినే ఏకైక మంత్రముగ భక్తి విశ్వాసములతో జపించుచుండవలెను.

# 3
# బ్రహ్మచర్యము

మన వ్రతములలో మూడవది బ్రహ్మచర్యము. ఆలోచించి చూచినచో మిగిలిన వ్రతము లన్నియు వాస్తవమునకు సత్యవ్రతమునుండియే పుట్టుచున్నవి. ఆ వ్రతములను పాలించుట కూడ దాని కొరకే. సత్యమును వరించిన మనుష్యుడు దానినే ఉపాసన జేయును. దానిని తప్ప ఇంకే వస్తువునైనను ఉపాసన జేసినచో అతడు వ్యభిచారి కాగలడు. అట్టిచో మనోవికారముల నారాధించుట కెట్లు పొసగును? తన ప్రవృత్తుల నన్నిటిని లేదా తన కార్యకలాపముల నన్నింటిని సత్య సందర్శనము కొరకే వినియోగించువాడు సంతానోత్పత్తి కార్యములో గాని లేదా సంసారమును నడపుటన్న జగడములో గాని ఎట్లు పడగలడు? భోగవిలాసముల ద్వారా సత్యసందర్శనము గావించిన వాని ఉదాహరణము ఒక్కటి కూడ నేటి వరకు మన మెరుగము.

అహింసావ్రతమును పాలించు విషయమే మన మాలోచించినచో బ్రహ్మచర్యములేనిదే అది కొనసాగజాలదు. లేదా సాధ్యముకాజాలదు. ఒక పురుషుడు ఒక స్త్రీకిగాని, లేదా ఒక స్త్రీ ఒక పురుషునకుగాని తన ప్రేమనంతను అర్పించినచో ఇతరులకిచ్చుటకు వారిరువురివద్ద ఏమి మిగిలి ఉండును? అట్లు అర్పించుకొనుటన్న ముందర మేమిద్దరము, మా తర్వాతనే మిగిలిన ప్రపంచమని గదా అర్థము. పతివ్రతయైన స్త్రీ భర్తకొరకును, పత్నీవ్రతుడైన పురుషుడు భార్య

కొరకును సర్వస్వమును అర్పించుటకు సిద్ధముగా ఉండ వచ్చును. కాని దానివల్ల సర్వవ్యాప్తమైన ప్రేమను అనగా విశ్వప్రేమను పాలించుట జరుగజాలదు. తమదనుకొనుచున్న కుటుంబమొకటి వారి కేర్పడుచుండుటవల్ల వారు సృష్టినంతను తమ కుటుంబముగా గావించుకొనలేరు. వారి కుటుంబము ఎంతవృద్ధి అగుచుండునో విశ్వప్రేమనుండి వారంత దూర మగుచుందురు. దీనికి ఉదాహరణములు ప్రపంచ మంతటను మనము చూచుచునే ఉన్నాము. అందుచేత అహింసావ్రత మును పాలించువారు వివాహమును జేసికొనజాలరు. వివాహ బంధనము లేకుండ వికారములను తృప్తిగా ఎంచుకొను ప్రసక్తికి తావే లేదుగదా ?

అట్లయిన వివాహము చేసికొనినవారి గతి ఏమి ? సత్య దర్శనమన్నది వారికి లేనేలేదా ? సర్వసమర్పణను వారెన్న టికిని చేయజాలరా ? దీనికొక ఉపాయమున్నది. అది వివా హితులుకూడ అవివాహితులుగ వ్యవహరించుటే. ఈ విష యములో ఇంతకు మించిన మార్గమింకొకటి నాకు కనుపించ లేదు. అట్టి స్థితిని రుచి చూచినవాడు దాని విలువను గురించి సాక్ష్యమీయగలడు. వివాహితులు అవివాహితులుగ వ్యవహ రించు ఈ ప్రయోగము సత్ఫలితముల నిచ్చునట్టిదని ఋజు వైనదని చెప్పవచ్చును. వివాహితులైన స్త్రీ పురుషులు ఒండొరులను సోదరీసోదరులుగ భావించుకొన సాగినచో వారన్ని చిక్కులనుండి బయట పడుదురు. లోకములోగల స్త్రీ లందరు తల్లులన్న లేదా అక్క చెల్లెండ్రన్న లేదా

పుత్రికలన్న భావమే మనుష్యుని ఒకేసారి ఉన్నతస్థితికి తీసికొనపోగలిగి, బంధవిముక్తిని చేయగల మార్గము కాగలదు. దీనివల్ల భార్యాభర్తలకు పోవునదేదియులేదు. అందులకు బదులు వారిప్రేమ బలిసి పెరిగిపోవును. వారి కుటుంబము పెద్దదై పోవును. మనోవికారము లనే మైలను లాగివేయుటవల్ల, నిజమైన ప్రేమ వృద్ధిజెందును. వికారములు పోవుటచే ఒకరి సేవ ఇంకొకరు బాగుచేయగలుగుదురు. ఒకరితో ఒకరు కలహించుటకుగల అవకాశములు తక్కువై పోవును. స్వార్థపరమైనట్టి, ఒక వ్యక్తిమీద ఆధారపడినట్టి ప్రేమలో కలహములకు ఎక్కువ అవకాశముండును.

ప్రధానమైన ఈ విషయమును తెలిసికొని హృదయస్థము గావించుకొన్న పిమ్మట బ్రహ్మచర్యమువల్ల కలుగు వీర్యలాభాదిశారీరకలాభములు అప్రధానములై పోవును. తెలిసియే భోగవిలాసములకొరకు వీర్యమును నష్టముచేసికొని శరీరమును నిస్సారముచేసికొనుట ఎంతమూర్ఖత ? శారీరిక మానసిక శక్తులను వృద్ధిచేసికొనుటకే వీర్యము. అట్టి దానిని విషయభోగములకొరకు ఉపయోగించుట నిశ్చయముగ దానిని దురుపయోగము చేయుటే. ఇట్టి దురుపయోగము అనేక రోగములకు మూలమైపోవును.

ఇట్టి బ్రహ్మచర్యమును మనోవాక్కాయ కర్మల అనగా త్రికరణశుద్ధిగ పాలించవలెను. వ్రతముల విషయములో మనము ఈ సంగతినే బాగుగ గ్రహించవలెను. దేహమును

వశము నందుంచుకొనునట్లు కనబడుచు, మనస్సులో వికార ములను పోషించుకొనువాడు. మూఢుడని– మిథ్యాచారి యని గీతలో చెప్పబడెను. మనస్సులో వికారముల నుండ నిచ్చి, శరీరము నణచిపెట్టుటకు ప్రయత్నించుటవల్ల హాని కలుగునన్న సంగతి మన కందరకు అనుభవములో నున్న మాటయే. మనస్సున్న చోటికే శరీరముకూడ చివరకు లాగు కొనిపోబడ కుండ ఉండజాలదు. ఇక్కడ ఒక భేదమును తెలిసికొనుట అవసరము. మనస్సును వికారముల వశము గానిచ్చుట ఒకమాట, మనస్సు దానంత టదే, మన కిష్టము లేకున్నను బలాత్కారముగ వికారముల పొందుచుండుట రెండవ మాట. ఈ వికారములకు లోనగుటలో దానికి దానికి మనము సహాయము చేయకుండినచో తుదకు జయము మనదే. శరీరము మన వశములో ఉండునుగాని మనస్సు ఉండదన్న సంగతి ప్రతి క్షణము మన కందరకును అనుభవ ములో నున్న సంగతే. అందుచేత శరీరమును వశమునం దుంచుకొని మనస్సును వశము జేసికొనుటకు నిరంతము ప్రయ త్నించుచుండినచో మన కర్తవ్యమును మనము పాలించినట్లే. మన మనస్సునకు మనము లొంగిపోయినవెంటనే మన మనః శరీరముల మధ్య జగడము ప్రారంభము కాగలదు. దాని వల్ల మిథ్యాచారమునకు అంకురార్పణ జరుగగలదు లేక కాగలదు. కాని, మనోవికారములను నిగ్రహించుచుండి నచో మన మనఃశరీరములు రెండును తుదకు కలిసిపోవుట జరుగుదని చెప్పవచ్చును.

బ్రహ్మచర్యమును పాలించుట చాల కఠినమే గాక దాదాపు అసంభవమని లోకములో ననుకొందురు. బ్రహ్మచర్యమునకు చాలా సంకుచితమైన అర్థమును గ్రహించుటే అట్లనుకొనుటకు కారణమని విచారించినమీదట తెలియుచున్నది. జననేంద్రియ వికారమును నిరోధించుటమాత్రమే బ్రహ్మచర్యవ్రతమును పాలించుటగా అంగీకరింపబడెను. నా అభిప్రాయములో ఈ అర్థము లేక వ్యాఖ్య అసంపూర్ణమే గాక పొరపాటుతో గూడినది. విషయములను అనగా సర్వేంద్రియములను నిరోధించుటే బ్రహ్మచర్యము. మిగిలిన ఇంద్రియములను ఇష్టము వచ్చినట్లుగ తిరుగనిచ్చుచు ఒక్క జననేంద్రియమును నిరోధించుటకు ప్రయత్నించువాడు నిశ్చయముగ నిష్ఫల ప్రయత్నము చేయుచున్నాడు. చెవులతో వికారపుమాటలను వినుచు, కండ్లతో వికారములు పుట్టించు వస్తువులను చూచుచు, నాలుకతో వికారోత్తేజకములైన వస్తువులను రుచి చూచుచు, చేతులతో వికారములను ఉద్రేకపరచు వస్తువుల నంటుచు— జననేంద్రియమును నిరోధించగోరుట నిప్పులో చేయిపెట్టి— అది కాలకుండ ఉంచుటకు చేయు ప్రయత్నము వంటిది. అందుచేత జననేంద్రియమును నిరోధించుటకు నిశ్చయించుకొనువారు, మిగిలిన ఇంద్రియలను వికారములనుండి నిరోధించుటకు నిశ్చయించుకొనవలెను. బ్రహ్మచర్యమునకు సంకుచితమైన వ్యాఖ్య చేయుట వల్ల లేక అర్థముచెప్పుటవల్ల చాల హాని కల్గినదని నా కెప్పుడు ననిపించుచుండును. మనము సర్వేంద్రియములను సమాన

ముగ వశము గావించుకొనుటకు అభ్యసించుట మొదలుపెట్టి నచో జననేంద్రియమును వశము గావించుకొను ప్రయత్నము త్వరగా సఫలము కాగలదని నిశ్చితమైన నా మతమూ నా అనుభవముకూడ అదే. వీటిలో ముఖ్యమైనది స్వాదేంద్రియము— అనగా జిహ్వారుచి. అందుచేతనే మన ఆశ్రమ వ్రతములలో దాని సంయమమునకు— అనగా ఆస్వాదనమునకు వేరే లేక ప్రత్యేకస్థాన మొసంగితిమి. దానివిషయమై వచ్చే వారము వ్రాసెదను.

బ్రహ్మచర్యముయొక్క మూలార్థమును మనమందరమును జ్ఞాపకముంచుకొనవలెను. బ్రహ్మచర్య అనగా బ్రహ్మ యొక్క అనగా సత్యముయొక్క అన్వేషణలో చర్య—అనగా తత్సంబంధమైన ఆచారములేక ఆచరణ. ఈ మూలార్థము నుండి సర్వేంద్రియ సంయమ రూపమైన విశేషార్థము పుట్టుచున్నది. కేవలము జననేంద్రియ నిగ్రహమనునట్టి అసంపూర్ణమైన అర్థమును మనము మరచిపోవలెను.



## 4
## ఆస్వాదము

ఈ వ్రతము బ్రహ్మచర్యమునకు చాల సన్నిహిత సంబంధముగలది. నా అనుభవము ప్రకారము ఈ వ్రతమును పాలించుటలో సమర్థులైనవారికి జననేంద్రియ నిగ్రహము పూర్తిగ సులభమైపోవును. సాధారణముగ దీనికి వ్రతము

లలో ప్రత్యేకస్థాన మియ్యబడమ. స్వాదమును అనగా రుచిని మహామునివరులే జయించలేకపోయినారు. కావుననే దీనికి ప్రత్యేకస్థాన మియ్యబడలేదు. కాని ఇదినా ఊహ మాత్రమే అది సరియైనను కాకున్నను ఈ వ్రతమునకు మనము ప్రత్యేక స్థాన మొసంగినాము. అందుచేత దీని విషయమై ప్రత్యేక ముగ విచారించుట చాల ఉచితముగా ఉండును.

అస్వాదమను దానికి అర్థము- స్వాదమునకు అనగా రుచికి- జిహ్వకు ప్రాధాన్య మియ్యకుండుటయే. ఔషధమును సేవించునప్పుడు అది స్వాదిష్టమైనదా (అనగా రుచియైనదా) అన్న ఆలోచనలేకుండ, శరీరారోగ్యమునకు దాని అవసర మును గుర్తెరింగి- ఉచిత ప్రమాణములో దానినెట్లు సేవిం చెదమో అట్లే అన్నము విషయములో కూడ మనము యోచింపవలెను. ఇక్కడ అన్నమనుమాట మనము తిను పదార్థము లన్నింటికిని వర్తించును. లేదా సమస్త ఖాద్య పదార్థములకును వర్తించును. అందుచేత పాలు పండ్లు కూడ దానిక్రిందకు వచ్చును. మందును తీసికొనవలసినదాని కంటె తక్కువ ప్రమాణములో తీసికొనినచో లాభమెట్లు కలుగదో లేదా తక్కువ లాభము కలుగునో- అధిక ప్రమా ణములో తీసికొనినచో హాని ఎట్లు కలుగునో అట్లే అన్నము విషయములో కూడ జరుగును. కావున స్వాదము కొరకు ఏదైన వస్తువును రుచి చూచుటగాని తినుటగాని వ్రత భంగము క్రిందకు వచ్చును. స్వాదిష్టమైన లేక రుచికరమైన

పదార్థమును ఎక్కువ ప్రమాణములో తినుటవల్ల వ్రతభంగ మనాయాసముగ జరిగిపోవును. ఏదైన వస్తువుయొక్క రుచిని ఎక్కువ చేయుటకుగాని, మార్చుటకుగాని, లేదా అరుచిని లేక రుచిని తగ్గించుటకుగాని ఉప్పును కలుపుకొనుట కూడ వ్రతభంగము క్రిందకు వచ్చునని దీనివల్ల మనకు స్పష్టముగా తెలియుచున్నది. కాని మనుష్యునకు ఒకనియమిత పరిమాణ ములో ఉప్పు అవసరమని మన మెరుగుదుము. కావున అంత మాత్రమే ఉప్పు కలిపినచో దానివల్ల వ్రతభంగము కాదు. ఏదైన వస్తువు శరీరపోషణకు, వాస్తవమునకు అవసరముః కానప్పటికిని- అది అవసరమని భావించి- మనస్సును మోస పుచ్చుకొని, దానిని తీసికొనుట మిథ్యాచారము క్రిందకు వచ్చును.

ఈ దృష్టితో విచారించినచో- మన శరీరపోషణకు అవసరము లేనందువల్ల వదలిపెట్టవలసిన వస్తువుల జాబితాలో చేరవలసిన వాటి నెన్నింటిని మనము తీసికొనుచున్నామో మనకు తెలియగలదు. ఈ విధముగ అవసరములేని ఆ వస్తువుల నన్నింటిని అనాయాసముగ త్యజించిన మనుష్యుని వికార ములు శాంతిచెందగలవు. "జిహ్వా అనేక రుచులను గోరును- పొట్ట అనేక ఆటలాడించును. లేదా వేషములు వేయిం చును" అన్న లోకోక్తులలో గొప్ప అర్థము ఇమిడియున్నది. ఈ విషయమై చాలా తక్కువ పరిశోధన లేక విచారణ జరి గినది. అందుచేత ఈ వ్రతమును దృష్టియందుంచుకొని ఎట్టి ఆహారమును గైకొనవలెనో తేల్చుకొనుట ఆవశ్యకమైనది.

చిన్నప్పటినుండి తల్లిదండ్రులు అర్థములేని గారాబము చేసి పిల్లలకు పలువిధములైన రుచులను అలవాటుచేసి వారి ఆరోగ్యమును పాడుచేయుచుందురు. అందుచేత పెద్దవారైన తర్వాత ఆ పిల్లలు ఆరోగ్యదృష్టితో చూచిన రోగులుగను, రుచులదృష్టితో గాంచిన మహావికారులుగను కనబడుచుందురు. దీని దుష్ఫలితములను అడుగడుగునకు మన మనుభవించుచునే ఉందుము. అనవసరమైన ఖర్చులలో పడుదుము. డాక్టర్ల చుట్టును వైద్యుల చుట్టును తిరుగుచుందుము. శరీరమును ఇంద్రియములను వశమునం దుంచుకొనుటకు బదులు నాటికి బానిసలమైపోయి అంగవిహీనుల క్రింద జీవితములను గడపుచుందుము. రోగములేని పురుషుని ఒక్కనినైన తాను చూడలేదని అనుభవజ్ఞుడైన ఒక వైద్యు డనినాడు. రుచి లోభములో ఏమాత్రము పడినను శరీరారోగ్యముకొరకు ఉపవాసము చేయుట తప్పనిసరి యగుచుండును.

ఈ విధమైన నా భావములను చూచి ఎవ్వరు భయపడ నక్కరలేదు. అస్వాదవ్రతము ఎంత భయంకరమైనదో అని దానిని వదలిపెట్ట నవసరములేదు. ఏదైన వ్రతమును పూనుటకు అర్థము ఆ పూనుకొనిన సమయమునుండి దానిని పూర్తిగ పాలించుటకు పూనుకొంటిమని కాదు. వ్రతమును పూనుటకు అర్థము దానిని సంపూర్ణరూపములో పాలించుటకు త్రికరణశుద్ధిగను, వాస్తవముగను, యావజ్జీవితము దృఢ ప్రయత్నము చేయుట అని. ఒక వ్రతము కఠినమైనదైనచో

నిర్వచనములో దానిని సులభము గావించుకొని మనలను మనము మోసము చేసికొనరాదు. మన వీలుకొరకు ఆదర్శ మును తగ్గించి వేయుట అసత్యమగును. మనము పతనమై పోవుట జరుగును. ఆదర్శమును సరిగ తెలిసికొని-అది ఎంత కఠినమైనదైనను దానిని పొందుటకు లేక చేరుటకు ఏకాగ్ర చిత్తముతో ప్రయత్నించుటే పరమార్థము - పురుషార్థము. పురుషశబ్దమునకు నరుడని అర్థము చెప్పక - దాని మూలార్థ మును గ్రహింపవలెను. పురుషుడనగా శరీరములో నుండు వాడని మూలార్థము. ఈ అర్థమును తీసికొన్నచో పురుషార్థ మను శబ్దమును స్త్రీ పురుషు లిరువురకును వర్తించునట్లు ప్రయోగింపవచ్చును. త్రికాలములందునను మహావ్రతము లను సంపూర్ణరూపములో పాలించుటయందు సమర్థుడైనవానికి జగత్తులో చేయవలసినదేమియు ఉండదు. అతడు భగవంతుడు అతడు ముక్తుడు. మనమన్ననో అల్పులము. ముముక్షు లము. జిజ్ఞాసులము. సత్యాగ్రహులము. అనగా సత్యము నందు పట్టుదలగలవారము. ఆ సత్యము నన్వేషించు ప్రాణు లము. అందుచేత గీత చెప్పినట్లు, నెమ్మది నెమ్మదిగ, ఏమరుపాటులేకుండ మనము ప్రయత్నము చేయుచుండవలెను. అట్లు చేయగ చేయగ ఒకనాడు ప్రభుప్రసాదమునకు మనము యోగ్యులముకాగలము. అంతట మనలోని విషయవాసన కూడ భస్మమై పోగలదు.

అస్వాదవ్రతముయొక్క మహత్వమును తెలిసికొన్న తర్వాత దానిని పాలించుటకు మనము క్రొత్తగ ప్రయత్న

మారంభించవలెను. ఇందులకై దినములోని ఇరువదినాలుగు గంటలు భోజనవిషయమే ఆలోచించుచు కూర్చుండనక్కర లేదు. కాని పూర్తిగ సావధానులమై, జాగరూకులమై ఉండుట చాల అవసరము. అట్లుండుటవల్ల శరీరపోషణకొరకు మనమెప్పుడు తినుచున్నామో—కేవలము రుచికొరకే మనమెప్పుడు తినుచున్నామో కొద్దికాలములోనే మనకు తెలియగలదు. అది తెలిసిన పిమ్మట దృఢతాపూర్వకముగ మనము మన రుచులను తగ్గించుకొనుచు పోవలెను. ఈ దృష్టితో చూచినచో అస్వాదవ్రతము నవలంబించిన వారందరును కలిసి ఒకేచోట వంటచేయించుకొనుట చాల సహాయకారిగ ఉండగలదు. అప్పుడు ప్రతిరోజు ఈ దినము ఏమి తినవలెను, వంట ఏమిచేసికొనవలెను అని ప్రతి మనిషి ఆలోచించవలసిన అవసరముండదు. అప్పుడు, తయారైన వంటకములో వదలి పెట్టవలసిన దానిని వదలిపెట్టి దానిని భగవత్ప్రసాదమనుకొని, మనస్సులోనైన దానిని విమర్శించకుండగ— శరీరపోషణకు అవసరమైనంత సంతోషపూర్వకముగ తిని లేచిపోవచ్చును. అట్లు చేయువాడు అనాయాసముగ అస్వాద వ్రతమును పాలించగలడు. అందరకును కలిపి వంటచేయువాడు మన భారమును తగ్గించివేయును. మన వ్రతమునకు ఆతడు రక్షకుడగును. రుచిగ ఉండునట్లు చేయు ఉద్దేశముతో ఆతడు దేనిని సిద్ధముచేయరాదు. కేవలము శరీరపోషణకు తోడ్పడునట్లుగనే వంటకములను తయారుచేయవలెను. నిజము చెప్పవలెనన్న ఆదర్శస్థితిలో వంటకముల తయారుచేయుటకు

అగ్నిని వీలైనంత తక్కువగ ఉపయోగింపవలెను లేదా ఉప యోగించనేరాదు. సూర్యరూపమైన మహాగ్నివల్ల సిద్ధమైన వస్తువులనుండియే మనము మన ఆహారపదార్థములను ఎన్నుకొనవలెను. ఈ విచారణవల్ల మనుష్యుడు కేవలము ఫలహారియే కావలెనని తేలుచున్నది. కాని ఇక్కడ అంత లోతుగ విచారించ నవసరము లేదు. అస్వాదవ్రత మననేమి? దానిని పాలించుటలోగల కష్టము లేవి? బ్రహ్మచర్య వ్రత పాలనతో దాని కెంత దగ్గర సంబంధమున్నది? ఇంతమాత్రమే ఇక్కడ విచారింపవలసినది. ఇంతమాత్రము తెలిసికొని ఈ వ్రతమును యథాశక్తి పాలించుట కందరును ప్రయత్నింపవలెను.

---

# 5
# అస్తేయము

ఇప్పుడు మనము అస్తేయవ్రతమును గురించి ఆలోచింపవలెను. లోతునకుపోయి చూచినచో అన్ని వ్రతములు సత్యాహింసలనుండి లేదా సత్యము నుండియే బయలువెడలుచున్నవి. వాటిని ఈ విధముగ చూపింపవచ్చును.

సత్యము → అహింస (లేదా సత్యము — అహింస) → బ్రహ్మచర్యము, అస్వాదము, అస్తేయము, అపరిగ్రహము, అభయము

కోరినచో మన మీ క్రమమును ఇంకను ఎక్కువ చేయవచ్చును.

సత్యమునుండి అహింస పుట్టినదనుకొనవచ్చును. లేదా సత్యాహింసలను ఒక జత క్రింద చూడవచ్చును. రెంటను ఒక్కటే. అయినను నా మనస్సు మొదటిదాని వైపే మ్రొగ్గును. ఆఖరిస్థితి ద్వంద్వాతీతమైనది. పరమసత్య మొక్కటే స్థిరముగ నుండును. సత్యము సాధ్యము అనగా లక్ష్యము అహింస సాధనము. అహింసను మన మెఱుగుదుము. అయినను దానిని పాలించుట కష్టము. సత్యములో నుండి కేవలమొక అంశమునే మన మెఱుంగగలము. దేహధారికి అహింసను పూర్తిగ పాలించుట కష్టమైనట్లే సంపూర్ణ సత్యమును తెలిసికొనుట కూడ కష్టమే.

అస్తేయమునకు అర్థము దొంగతనము చేయరాదని. దొంగయైనవానికి సత్యము నెరుంగుటగాని లేదా ప్రేమధర్మమును పాలించుటగాని సంభవము కాదు. అయినప్పటికిని మనమందరమును కూడ తెలిసియో, తెలియకయో, కొద్దిగనో గొప్పగనో దొంగతనము చేయుచుందుము. ఇతరుని వస్తువును అతని అనుమతిలేకుండ తీసికొనుట దొంగతనమే. కాని మనుష్యుడు అప్పుడప్పుడు తన వస్తువులను కూడ దొంగతనము చేయును. ఒక తండ్రి తన పిల్లలకు తెలియజేయకుండ వారినుండి దాచిఉంచు ఉద్దేశముతో చప్పుడు గాకుండ ఏదేని వస్తువును తినుట దీనిక్రిందకువచ్చును. ఆశ్రమములోని

భండారము మన అందరిదని చెప్పబడును. కావున మాట్లాడ కుండ అందులోనుండి ఒక చిన్న బెల్లపుముక్కను తినువాడు కూడ దొంగయే. ఇంకొక పిల్లవాని కలమును తీసికొను పిల్ల వాడుకూడ దొంగతనమే చేయుచున్నాడు. ఎదుటివానికి తెలిసి ఉన్నను అతని అనుమతి లేకుండ అతని వస్తువునేదైనను తీసికొనుట దొంగతనమే. హక్కుదారులెవ్వరు లేరనుకొని ఏదైన వస్తువును తీసికొనుటకూడ దొంగతనమే. దారిలో పడియుండు వస్తువులకు యజమానులము మనము కాము. ఆ వస్తువు పడియున్న ప్రదేశ మేరాజ్యములో నున్నదో ఆ రాజ్యము లేక ఆ ప్రభుత్వమే దానికి యజమాని. ఆశ్రమము దగ్గిర దొరికిన ఏ వస్తువునైనను ఆశ్రమముయొక్క మంత్రికి లేక కార్యదర్శికి అప్పగించవలెను. ఆ వస్తువు ఆశ్రమమునది కానప్పుడు మంత్రి దానిని పోలీసులకు అప్పగించగలడు.

ఇంతవరకు చెప్పినదానిని అర్థముచేసికొనుట బొత్తిగా కష్టములేని పని. కాని అస్తేయము ఇంతకు మించి ముందు నకు సాగిపోవును. అవసరములేని వస్తువును, ఆ వస్తువు యొక్క యజమానినుండి, అతని అనుమతితోకూడ తీసికొ నుట దొంగతనమే కాగలదు. అనావశ్యకముగ ఏవస్తువును కూడ తీసికొనరాదు. ఇట్టి దొంగతనము, సాధారణముగ, తినే వస్తువుల విషయములో జరుగుచుండును. నాకవసరము లేని పండును దేనినైనను నేను తిన్నచో లేదా అవసరమైన దానికంటె ఎక్కువగా తిన్నచో- అది దొంగతనమే. నిజము నకు తన కేది ఎంత అవసరమో ఎల్లవేళల మనుష్యుడెరుంగ

జాలడు. తరచుగ మన మెల్లరము మన కవసరమైనదానికంటె ఎక్కువగనే అవసరమని చెప్పుదుము. ఆ విధముగ చెప్పుట వల్ల మనకు తెలియకుండగనే మనము దొంగలమగుచున్నాము. ఆలోచించి చూచినచో మన అవసరము లెన్నింటినో మనము తగ్గించుకొనవచ్చును. అస్తేయ వ్రతమును పాలించువాడు క్రమక్రమముగ తన అవసరములను తగ్గించుకొనుచుపోగలడు. ఈ లోకములోగల దారిద్ర్యములోని అధిక భాగమునకు అస్తేయవ్రతభంగమే కారణము.

పైన చెప్పబడిన దొంగతనము లన్నియు బాహ్యమైనవి లేదా శరీరముతో చేయబడినవి. ఇంతకంటె సూక్ష్మమైనవి మానసికమైన దొంగతనములు. అవి ఆత్మపతనమునకు దారి తీయును. ఏదైన ఒక వస్తువును పొందవలెనని మనస్సుతో కోరుట లేదా ఏదైన ఒక వస్తువుపై లోభదృష్టులను బరపుట దొంగతనము. పిల్లలుగాని పెద్దలుగాని ఏదైన మంచి వస్తువును చూచి ఆశపడుట మానసిక చౌర్యము చేయుటే. ఉపవాసమున్న మనుష్యుడు స్వయముగ తాను తినకుండ నుండి ఇతరులు తినుచుండగ చూచి మనసా రసాస్వాదనము చేయుచున్నచో అతను దొంగతనము చేయుచున్నట్లే. ఉపవాసవ్రతమునకు భంగము కలిగించికొనినట్లే. ఉపవాసముండువాడు మనసా ఉపవాసముండక ఏయే పదార్థములను భుజింపవలెనో ఆలోచించుకొనుచుండినచో వాడు అస్తేయవ్రతమును ఉపవాసమును కూడ చెడగొట్టుకొనుచున్నాడని చెప్పవలెను. అస్తేయవ్రతమును పాలించువాడు

భవిష్యత్తులో తనకు దొరుకబోవు వస్తువుల విషయమై పట్టించుకొనకు. దురాశాపూరితమైన ఈ కోరికయే అనేక దొంగతనములకు మూల మగుచుండుట మనము చూచు చుందుము. మనము ఈ రోజు ఏ వస్తువు కావలెనను కొందుమో మరునాడు దానిని పొందుటకు మంచిచెడ్డలను పాటించకుండ అన్నిమార్గముల ద్వారా ప్రయత్నించెదము.

వస్తువులవలెనే భావములను కూడ దొంగతనము చేయుట జరుగును. ఫలానా ఉత్తమభావము లేక ఆలోచన మనకు తోచకపోయినను అహంకారపూర్వకముగ అది నాకే ముందు తోచినదని చెప్పుట భావచౌర్యము క్రిందకు వచ్చును. ప్రపంచములో అట్టి దొంగతనములను అనేక విద్వాంసులు కూడ చేసిరి. ఈ నాడు కూడ చేయుచున్నారు. ఆంధ్రదేశ ములో క్రొత్తరకపు రాట్నము నొకదానిని నేను చూసితినను కొందము. అట్టిరాట్నమును నేను ఆశ్రమములో తయారు చేసి, దానిని నేనే కనిపెట్టితినని చెప్పినచో ఇతరులు కనిపెట్టిన దానిని నేను దొంగతనము చేయుచున్నాననుట స్పష్టమే. అట్లు చేయుటలో నేను అసత్యముమీద ఆధారపడుచుండుట జరుగుచున్నది. కావున అస్తేయవ్రతమును పాలించువాడు చాల వినమ్రుడై, అత్యంత విచారశీలుడై బహుసావధానుడై మిగుల అతిసాధారణమైన జీవితమును గడపవలసియుండును.

---

## 6

# అపరిగ్రహము

అపరిగ్రహమును అస్తేయముతో సంబంధముగల దానిగ తెలిసికొనవలెను. వాస్తవమునకు, దొంగిలింపకున్నను అనావశ్యకమైన వస్తువులను సంగ్రహించుట అనగా చేర్చుట దొంగతనము చేసినట్లేయగును. పరిగ్రహమను మాటకు జమ చేయుట లేక చేర్చుట అని అర్థము. సత్యాన్వేషితుడు, అహింసావాది పరిగ్రహమును చేయజాలడు. పరమాత్ముడు పరిగ్రహము చేయడు. అనగా వస్తువులను ప్రోగుచేసిఉంచడు. ఏ రోజున కవసరమగు వస్తువులను ఆరోజే సృష్టించును లేక ఉత్పత్తిచేయును. అందుచేత, మనకాపరమాత్మపై నమ్మక మున్నచో, ఏ రోజునకు కావలసిన వస్తువులను ఆరోజునకు ఆయన మనకు ఇచ్చునని, ముందుకూడ ఇయ్యగలడని మనము గ్రహించవలెను. భక్తులయొక్క ఫకీరుల యొక్క అనుభవమదే. ఏదినమునకు కావలసిన వస్తువులను ఆ దినముననే పుట్టించుట ఈశ్వర నియమమని మన మెరుగము. ఒకవేళ ఎరింగిఉన్నను దానిని మనము పాలించుటలేదు. అందువల్ల జగత్తులో విషమత లేక అసమానత్వము ఏర్పడుచున్నది. దానివల్ల కలుగు దుఃఖమును మనము అనుభవింపవలసి వచ్చుచున్నది. ఒక వంక ధనవంతుని ఇంటిలో అతనికి అనావశ్యకమైన వస్తువులు నిండి ఉండును. తగినంత జాగ్రత్త తీసికొనబడకుండుట వల్ల అవి పాడైపోవుచుండును. ఇంకొకవంక ఆ వస్తువులు

లేనందువల్ల కోట్లకొలది మనుష్యులు దారి డొంక లేక తిరుగు చుందురు. ఆకలితో చనిపోవుచుందురు. చలికి కొంకరులు పోవుచుందురు. మనుష్యు లందరును తమకు కావలసిన వస్తువులనే సంగ్రహము చేసికొన్నచో ఎవ్వరికిని కష్టముండదు. అందరికిని సంతోషముండును. నేడు ఇరువురును కూడ లేమినే అనుభవించుచున్నారు. కోటీశ్వరుడు నూరు కోట్లు సంపాదించుటకు గిలగిల కొట్టుకొనును. అతనికి సంతోష ముండదు. దరిద్రుడు కోటీశ్వరుడు కాగోరును. కడుపునిండ దొరికిన అతడు సంతోషపడుచున్నట్లు కనబడడు. కాని కడుపునిండ తిండిని బడయుటకు దరిద్రునకు హక్కున్నది. అతనికి అట్లు దొరుకునట్లు చూచుట సంఘముయొక్క ధర్మము లేక విధి. అందుచేత ధనికుడు తనకును దరిద్రునకును సంతోషము కల్గించునట్టి పనిని ప్రారంభించవలెను. ఆతడు చాల ఎక్కువగ వస్తువులను జమచేయుట మానినచో దరిద్రునకు కావలసిన వస్తువులు తగినంత సులభముగ దొరుకగలవు. దానివల్ల రెండు పక్షములవారును సంతోషముగ నుండుటెట్లో తెలిసికొనగలరు. మనసా, కర్మణ్యా దిగంబరుడైననాని దే సంపూర్ణమైన— ఆదర్శప్రాయమైన అపరిగ్రహము. అతడు పక్షివలె ఇల్లులేకుండ, బట్టలేకుండ, అన్నములేకుండ తిరుగు చుండును. అతనికి ప్రతిరోజు కావలసిన అన్నమును భగవంతు డిచ్చుచుండును. అవధూత ఇట్టిస్థితిని చేరుట చాల అరుదుగనే జరుగును. మామూలు స్థితికి చెందిన మనవంటి సత్యాగ్రహులము, జిజ్ఞాసువులము ఆ ఆదర్శమును ధ్యానమునం దుంచు

కొని మనము చేర్చిన వస్తువులలో మన కవసరమైన వేవో నిత్యము విచారించుకొనుచు, వీలగునంతవరకు వాటిసంఖ్యను తగ్గించుకొనుచుండవలెను. నిజమైన సభ్యతకు లక్షణము, వాస్తవమైన ఆత్మసంస్కారమునకు గుర్తు— ఇచ్ఛాపూర్వకముగ, ఆలోచించి పరిగ్రహమును తగ్గించుకొనుటేగాని ఎక్కువ చేసికొనుట కాదు. పరిగ్రహమును తగ్గించుకొనుచుపోయినచో నిజమైన సుఖసంతోషములు వృద్ధియగుచుండగలవు. సేవాశక్తి లేక సేవచేయుటకు శక్తికూడ వృద్ధిపొందగలదు. ఈ దృష్టితో విచారించి, నడిచికొనినచో వాటి ఆవశ్యకతను ఋజువుచేయలేని అనేక వస్తువులను మనము ఆశ్రమములో చేర్చుచున్నాము. అనావశ్యకమైన అట్టి పరిగ్రహమువల్ల— ఆ వస్తువులను దొంగిలింపవలెనను బుద్ధిని లేక ఆశను పొరుగువారికి కలుగజేయుచున్నాము. అభ్యాసమువల్ల మనుష్యుడు తన అవసరముల తగ్గించుకొనుచు పోవచ్చును. అట్లు తగ్గించుకొనుచుపోవువాడు, సుఖి, శాంతుడు ఆరోగ్యవంతు డగుచుండును. కేవలము సత్యముయొక్క దృష్టితో లేదా ఆత్మదృష్టితో విచారించినచో ఈ శరీరముకూడ పరిగ్రహము క్రిందకే వచ్చును. భోగేచ్ఛకొరకు మనము శరీరమును ధరించి నిలబెట్టుకొనుచున్నాము. ఆ భోగేచ్ఛ అత్యంతము క్షీణించిన పిమ్మట శరీరముండవలసిన అవసరముండదు. సర్వవ్యాపియైన— అనగా అంతటవ్యాపించియుండు ఆత్మ శరీరమను పంజరములో ఎట్లు బంధింపబడి ఉండగలదు? ఈ పంజరమును నిలబెట్టుకొనుటకు అనర్థములైన పనులెట్లు

చేయగలరు? ఇతరుని చంపుట ఎట్లు? ఇట్లు విచారించుకొనుచు బోయినచో సంపూర్ణ త్యాగమే ఆదర్శమని మనము గ్రహింప గల్గుదుము? శరీర మున్నంతవరకు దానిని సేవార్థము వినియోగించుట నేర్చుకొందుము. తుదకు సేవయే శరీరమునకు నిజమైన భోజనము కాగలదు. తినుట, త్రాగుట, నిద్రించుట, కూర్చుండుట, మేల్కొనుట, కునికిపాట్లు పడుట – అన్నియు సేవకొరకే జరుగును. దీనివల్ల కలుగు సుఖము నిజమైన సుఖము. ఈ విధముగ వ్యవహరించు మనుష్యుడు అంతమున సత్యమును దర్శించగలడు. మనము చేయు పరిగ్రహము విషయమై మన మందరమును ఈ దృష్టితో ఆలోచించుకొనవలసి ఉండును.

వస్తువులకు వర్తించునదే భావపరిగ్రహమునకు కూడ వర్తించవలెనని మనము జ్ఞాపకముంచుకొనవలెను. తన బుర్రను నిరర్థకమైన జ్ఞానముతో నింపు మనుష్యుడు పరిగ్రహియే. మనలను ఈశ్వరునకు విముఖులను చేయు తలంపులు లేక భావములు – లేదా ఏవి మనలను ఈశ్వరుని దిక్కునకు తీసికొనిపోవో అవి అన్నియు పరిగ్రహము క్రిందకే వచ్చును. కావున అవి వదలిపెట్టవలసినవగును. భగవద్గీతలోని పదమూడవ అధ్యాయములో జ్ఞానమును గురించి భగవానుడు ఇచ్చిన నిర్వచనమును మనము తలంపునకు తెచ్చుకొనవలెను. అమానిత్వము (వినమ్రత) మున్నగు గుణముల లెక్కచెప్పి వాటికి భిన్నమైనవన్నియు అజ్ఞానమనియే చెప్పెను. ఆ చెప్ప

బడినది సత్యమైనచో-సందేహమెందులకు ? అదిముమ్మాటికీ నిజమే- జ్ఞానమన్న పేరుతో నేడు మనము సంగ్రహించు దానిలో చాల భాగము అజ్ఞానమే. దానివల్ల లాభమునకు బదులు హాని కలుగుచుండును. బుద్ధిభ్రమించును. ఒకొకప్పుడు బుర్ర ఖాళీఅయిపోవును. అసంతోషము వ్యాపించిపోవును. అనర్థము వృద్ధియగుచుండును. దీనికర్థము బుద్ధి చురుకుగ ఉండరాదనికాదు. మన జీవితములోని ప్రతిక్షణమును పనిలో గడపవలెను. అనగా ప్రవృత్తిమయమై ఉండవలెను. కాని ఆ ప్రవృత్తి సాత్త్వికమై ఉండవలెను. సత్యమునైపు కొనిపోవునదై ఉండవలెను. సేవాధర్మమును స్వీకరించినవాడు క్షణమైనను సోమరిగ ఉండజాలడు. సారాసారముల గ్రహించు వివేకమును మనము నేర్చుట అవసరము కాని సేవాపరాయణుడైనవానికి ఆ వివేకము సహజముగ లభించును.

## 7
## అభయము

భగవద్గీతలోని పదహారవ అధ్యాయములో దైవీసంపదను వర్ణించుచు భగవానుడు – అభయమునకు ప్రథమస్థానమిచ్చినాడు. అభయమునకు శ్లోకములో ప్రథమస్థానమిచ్చుట శ్లోకరచనలో సౌకర్యముండుటవల్లనా లేక అట్లిచ్చుట ఉచితమనియా, అన్న వివాదములో నేను దిగదలచుకొనలేదు. అది నిర్ణయించుటకు తగిన యోగ్యత కూడ నాకు లేదు. అనాయాసముగ అభయమునకు శ్లోకములో ప్రథమస్థానము

దొరికినచో అట్లు దొరుకుట దానికి తగియే ఉన్నది. అభయము లేకుండ ఇతర సంపత్తి లభించజాలదు. అభయము లేకుండ సత్యాన్వేషణ ఎట్లు జరుగగలదు? అభయము లేకుండ అహింసాపాలన ఎట్లు కొనసాగగలదు? హరిమార్గమున పోవుటన్న కత్తిమొనమీద నడచుటన్నమాట. అది పిరికివారలు చేయగలిగిన పనికాదు. సత్యమే హరి. అదే రాముడు. అదే నారాయణుడు. అదే వాసుదేవుడు. పిరికివాడనగా భయభ్రాంతుడు, గుండెదిటవులేనివాడు. వీరుడనగా భయములేనివాడు. అంతేగాని కత్తి మొదలగువాటిని తగిలించుకొని తిరుగువాడని కాదు. కత్తి శూరత్వమునకు చిహ్నముకాదు. పిరికితనమునకు గుర్తు.

అభయమనగా - మరణభయమునుండి, ధనసంపదలు దోచుకొనిపోబడునన్న భయమునుండి, కుటుంబములోని వారి విషయమైన భయమునుండి, రోగభయమునుండి, శస్త్రాస్త్రములవల్ల దెబ్బలు తగులునన్న భయమునుండి, ప్రతిష్ఠ బోవునన్న భయమునుండి, ఇతరులు తన్ను గురించి చెడుగ తలంతురన్న భయమునుండి ఇవియేగాక ఇట్టివేయైన అసంఖ్యాకములైన బయటి భయములనుండి ముక్తుడగుట. ఒక్క మరణభయమును జయించినచో అన్ని భయములను జయించినట్లే అని సాధారణముగ చెప్పుదురు. కాని అది యదార్థముగా కనుపించదు. చాలమంది, మరణభయమును వదలిపెట్టినప్పటికిని, ఇతర విధములైన దుఃఖములనుండి పారిపోవుదురు.

కొంతమంది తాము మృతిబొందుటకు సిద్ధముగనుందురు. కాని తమ సోదరులయొక్క బంధువులయొక్క వియోగమును సహింపజాలరు. పిసినిగొట్టయినవాడు వీటి నన్నింటిని వదలి పెట్టుటకే గాక చావునకు కూడ సిద్ధముగ నుండును. కాని తాను చేర్చిన ధనమును వదలుటకు భయపడును. తమ పదవు ప్రతిష్ఠలను వాటిని రక్షించుకొనుటకు కొందరు ఎట్టి దుష్కార్యమునైనను, వెనుదీయక, చేసివైచెదరు. కొందరు, లోకము నిందించునన్న భయమువల్ల, తెలిసియుండియు ఋజుమార్గమున పోవుటకు వెనుకాడుదురు. అన్ని భయములకు తిలాంజలి ఇచ్చినగాని సత్యాన్వేషికి ముక్తి లభించదు. హరిశ్చంద్రుని వలె నాతడు నశించిపోవుటకు సిద్ధముకావలెను. హరిశ్చంద్ర కథ కల్పితము కావచ్చును. కాని ప్రతి సత్యార్థి అనుభవమట్లే ఉన్నది. అందుచేత ఆ కథయొక్క విలువ ఇతర చరిత్ర కథలకంటె ఎన్నియో రెట్లు ఎక్కువ. అది అందరును ఆదరించి అనుసరించవలసినది.

అభయవ్రతమును ఎల్లప్పుడును పాలించుట దాదాపు అశక్యమైన పని. ఆత్మసాక్షాత్కారము నొందినవాడే భయమనుదానినుండి ముక్తినొందగలడు. మోహరహితమైన స్థితికి అభయము ఆఖరిమెట్టు. నిశ్చయబుద్ధితో సంతతము ప్రయత్నించుటవల్లను, ఆత్మవిశ్వాసమును పెంపొందించుకొనుటవల్లను నానాటికి భయము తగ్గి అభయము హెచ్చసాగును. బయటి భయములనుండి మనము ముక్తిని పొందవలెనని నేను

మొట్టమొదటనే చెప్పి ఉన్నాను. లోపల ఉన్న శత్రువు లకు భయపడుచునే మనము జీవిత యాత్ర సాగింపవలెను. కామక్రోధాదులవలని భయము నిజమైన భయము. వీటిని జయించుటవల్ల బయటి భయములవలని ఉపద్రవము దానంతటదే నశించిపోవును. భయ మనునది దేహముండుటవల్ల ఉండును. దేహవిషయమైన రాగము దూరమైపోవుటతోడనే అభయము సహజముగనే లభించగలదు. ఈ దృష్టితో చూచినచో భయమనునది మనము కల్పించుకొనుటవల్లనే పుట్టుచున్నదని తెలియగలదు. ధనమునుండి, కుటుంబము నుండి, శరీరమునుండి "నా లేక నాది" అను దానిని తొల గించినచో భయమెక్కడ ఉండును? లేదా, నా ధనము, నా కుటుంబము, నా దేహము అనువాటినుండి నా అను దానిని తొలగించినచో భయమునకు కారణమే ముండును? "తేన త్యక్తేన భుంజీథా": "ఇది రామబాణమువంటి వచనము. కుటుంము, ధనము, దేహము అవి ఉన్నట్లే ఉండి నను చిక్కులేదు. వాటి విషయములో తన భావమును మార్చుకొనవలెను. ఇది మనది కాదు. అది నాది కాదు. ఇది ఈశ్వరునిది. నేను ఈశ్వరునకు చెందినవాడనే. నాదని చెప్పుకొనువస్తు వేదియు ఈ ప్రపంచంలో లేదు. అప్పుడు దేనికొరకు నాకు భయము కల్గగలదు? అందుచేతనే ఉపనిషత్తు (ఈశావాస్యోపనిషత్తులోని మొదటి శ్లోకము.) దానిని త్యజించి దానిని భోగింపుము" అని చెప్పుచున్నది. అనగా మనము దానికి సంరక్షకులము కావలెను. దానిని

గక్షించుటకు వలయు సాధనసామగ్రిని ఆయన అనగా ఈశ్వరుడు మన కీయగలడు. ఈ విధముగా యజమానులముగాక మనము సేవకులమై, శూన్యమువలె ఉండిపోయినచో భయమును దానిని సహజముగనే జయించుదుము. శాంతిని పొందుదుము. సత్యనారాయణుని దర్శించగల్గుదుము.

---

8

# అస్పృశ్యతా నివారణము

అస్వాదవ్రతమువలెనే ఈ వ్రతముకూడ క్రొత్తదేగాక కొంత విచిత్రమైనదిగా కూడ కనిపించును. కాని ఇది ఎంత విచిత్రమైనదో అంతకంటె ఎక్కువ ఆవశ్యకమైనది. అస్పృశ్యత అనగా అంటరానితనము. ఇది ఎక్కడ పడిన అక్కడ, ధర్మముపేర లేక ధర్మమును సాకుగాగొని ధర్మమునకు విఘ్నము కలిగించును. ధర్మమును కలుషితము గావించును. ఆత్మ ఒక్కటే అయినచో ఈశ్వరుడు ఒక్కడే అయినచో అంటరానివాడెవ్వడు ఉండడు. లేక లేడు. మాలమాదిగలను పాకీవాండ్లను మనము అంటరాని వారిగ చూచుచున్నను వారు అంటరాని వారెట్లుకారో అట్లే శవము కూడ అంటరానిదికాదు. అది ఆదరణమునకు కరుణకు పాత్రమైనది. శవమును అంటుకొనుట, దానికి నూనె వ్రాయుట, దానికి క్షవరము చేయుట లేక చేయించుట మొదలగు పనులు చేసిన తర్వాత ఆరోగ్యదృష్టితో చూచినచో మనము

స్నానము చేయుట ఉచితముగా ఉండును. శవమును ముట్టు కొని, దానికి నూనె వ్రాసి స్నానము చేయకుండిన మనిషిని మైలపడినవాడని మనమనవచ్చును. కాని అతడు పాతకుడు కాదు. పాపికాడు. శిశువు దొడ్డికిపోయినచో దాని నెత్తు తల్లి, స్నానము చేయనంతవరకును లేదా కాలుసేతులను కడిగికొనునంతవరకును అంటరానిది కావచ్చును. కాని ఆట లాడుచు ఆ తల్లిని ముట్టుకొనినచో ఆ శిశువు మైలపడదు. దాని ఆత్మమలినముకాదు. కాని మాలమాదిగ మొదలగు పేరులే తిరస్కార సూచకములై పోయినవి. జన్మచేతనే వారు అంటరానివారుగ ఎంచబడుచున్నారు. సంవత్సర ములకొలది సబ్బు పట్టించుకొని స్నానము చేసినను, వైష్ణ వులవలె వేషము వేసినను, తులసిపూసల తావళమును ధరిం చినను, నిత్యము గీతాపఠనము గావించినను గ్రంధరచననే వృత్తిగా పెట్టుకొన్నను వారు అంటరాని వారిగనే పరిగణిం పబడుచున్నారు. దీనిని ధర్మమని నమ్ముటగాని, అట్లు ప్రవ ర్తించుటగాని ధర్మముకాదు. అధర్మము. నాశనము చేయ వలసినది. అస్పృశ్యతానివారణకు వ్రతములలో స్థానమిచ్చుట వల్ల అది హిందూధర్మములోని భాగముకాదని మనము అంగీకరించుచున్నాము. అంతియకాదు. అది హిందూధర్మ ములోనికి చొచ్చుకొనిపోయిన క్రుళ్లని భ్రమ అని, పాప మని, దానిని నివారించుట ప్రతి హిందువునియొక్క ధర్మమే గాక పరమకర్తవ్యమనికూడ మనము అంగీకరించుచున్నాము. అందుచేత దానిని పాపముగ భావించువారు దానికొరకు

ప్రాయశ్చిత్తమును చేసికొనవలెను. ఎక్కువగా ఏమిచేయ కున్నను, ప్రాయశ్చిత్త రూపములోనైన ధర్మమనుకొని, హిందువు అంటరాని వారని,వారుగ ప్రత్యేకముగ ఎంచబడు సోదరీసోదరులను దగ్గరకు తీయవలెను. ప్రేమతోను సేవాభావముతోను వారిని తాకవలెను. అట్లు తాకి తాను పవిత్రుడనైనట్లు భావింపవలెను. అంటరాని వారి కష్టములను తొలగింపవలెను. అణగద్రొక్కబడి ఉండుటవల్ల వారిలో పాతుకొనిపోయిన అజ్ఞానాది దోషములను పోగొట్టుకొనుటలో వారికి ధైర్యపూర్వకముగ తాను సహాయము చేసి, అట్లు చేయుటకు ఇతర హిందువులను ప్రేరేపింపవలెను. సమ్మతింపజేయవలెను. అస్పృశ్యతను ఈ దృష్టితో చూచు వ్రతధారి- దాని నివారణవల్ల కలుగు ఐహిక, రాజకీయ పరిణామములను తుచ్ఛముగ పరిగణించును. అట్టి పరిణామములు కలిగినను, కలుగకున్నను అస్పృశ్యతానివారణను వ్రతరూపముగ ఆచరించు వ్యక్తి, తన ధర్మమనుకొని అంటరాని వారుగ ఎంచబడు వారిని దగ్గరకు తీయగలడు. సత్యము మొదలగు వాటి ఆచరణలో మనము ఐహికఫలములను గురించి విచారించరాదు. వ్రతధారి సత్యాచరణను ఏదో ఒక యుక్తిక్రింద చేయడు. అది అతని శరీరముతో ముడివడిన వస్తువు. అతని స్వభావము. ఇదేవిధముగ, అస్పృశ్యత ఎంత చెడ్డదో అర్థమైన పిమ్మట, ఆ క్రుళ్లు కేవలము మాలమాదిగలవని చెప్పబడువారి వరకే ఆగలేదని తెలిసికొందుము. మొట్టమొదట ఆవగింజంత

చిన్నదిగ లోన ప్రవేశించి, తర్వాత కొండంత పెద్దదై, చివరకు దేనిలో ప్రవేశించినదో దానినే నాశనముచేసివైచుట క్రుళ్లుయొక్క స్వభావము. అంటరానితనమునకు కూడ ఇదే మాట వర్తించును. ఈ అంటరానితనము విధర్ములపట్ల ప్రారంభమైనది. అన్యసంప్రదాయములవారిపట్ల వచ్చినది. తర్వాత ఒకే సంప్రదాయమునకు చెందినవారిలో చొచ్చుకొని పోయినది. అది ఎంతవరకు చొచ్చుకొనిపోయినదనిన దానిని అదేపనిగ పాలించిన కొందరు ఈ పృథ్వికి భారరూపముగ నైపోయిరి. స్నానపానాదులలోను భోజనభాజనాదులలోను అంటరానితనమును పాటించుటకై చేయు అంతులేని ప్రయత్నములవల్ల తమ సంగతి సందర్భముల చూచుకొనుటకు వారికి తీరికే ఉండదు. ఈశ్వరుని మరచిపోయి ఈశ్వరునిపేరున వారు తమ్ముతామే పూజించుకొనసాగిరి. అందుచేత అస్పృశ్యతా నివారణకు పాటుబడువాడు మాలమాదిగలను దగ్గరకు తీయుటతోనే సంతోషపడడు. ప్రాణికోటిని తనలోనను, తన్ను ప్రాటికోటిలోనను చూచునంతవరకు అతడు శాంతుడు కాజాలడు. లేదా శాంతి జెందజాలడు. అస్పృశ్యతా నివారణయన్న యావత్ప్రపంచముతో మైత్రి చేయుటన్నమాట. యావత్ప్రపంచమునకు సేవకుడగుటన్నమాట. ఈ దృష్టితో చూచినచో అస్పృశ్యతానివారణ అహింసకు జోడై పోవును. నిజమునకది అట్టిదే. అహింస అనగా జీవమాత్రులయెడ సంపూర్ణప్రేమను కలిగియుండుట. అస్పృశ్యతానివారణకు కూడ ఇదే అర్థము. జీవమాత్రుల

యెడగల భేదమును నశింపజేయుట అస్పృశ్యతానివారణ. అస్పృశ్యతను ఈ అర్థములో తీసికొన్నచో, ఈ దోషము కొద్దిగనో గొప్పగనో ప్రపంచమంతటను వ్యాపించియున్నది. కాని హిందూధర్మములో నిండియున్న కుళ్లుగనే దానిని మనము విచారించితిమి. హిందూధర్మములో అది ధర్మము యొక్క స్థానము నాక్రమించుకొని, ధర్మము పేర లక్షలకొలది లేదా కోట్లకొలది మానవులను బానిసలవలె గావించివైచినది.



## ౯
## కాయకష్టము లేక శరీర శ్రమ

మనుష్యమాత్రునకు కాయకష్టము తప్పదన్న సంగతి టాల్‌స్టాయి వ్రాసిన ఒక వ్యాసమును చదువుటవల్ల నాకు మనస్సునకు పట్టినది. ఇంత స్పష్టముగ ఈ విషయమును తెలిసికొనుటకు పూర్వము 'రస్కిన్' వ్రాసిన 'అంటు దిస్ లాస్ట్' (Unto this Last) అను పుస్తకమును చదివితిని. చదివిన వెంటనే దానిని ఆచరణలోనికి తెచ్చుటకు ప్రారంభించితిని. కాయకష్టము లేక శరీరశ్రమ అనునవి 'బ్రెడ్ లేబర్' (Bread Labour) అను ఇంగ్లీషు శబ్దములకు అనువాదములు. 'బ్రెడ్ లేబర్' అనుదానికి శబ్దశః అర్థము 'రొట్టె కొరకు అనగా ఆహారము కొరకు శ్రమ' అని. ఆహారము కొరకు ప్రతి మానవుడు కాయకష్టము చేయుట అనగా కాలుసేతులను కదలించి పనిచేయుట ఈశ్వర నియమమన్న

సంగతిని కనిపెట్టినవాడు 'టాల్‌స్టాయి' కాదు. అది కనిపెట్టినది రష్యాదేశపు రచయితయైన 'బురోన్డ్రిఫ్' అనువాడు. అతను ఎంతమాత్రము ప్రసిద్ధికెక్కినవాడుకాడు. 'టాల్‌స్టాయి' ఆ నియమమును తాను ఆచరణలో పెట్టి, తన వ్రాతలద్వారా దానిని ప్రచారము చేసెను. ఇదే నియమము భగవద్గీతలోని మూడవ అధ్యాయములో నా కన్నులకు కనిపించుచున్నది. యజ్ఞము చేయకుండ తినువాడు దొంగతనము చేసిన అన్నము తినుచున్నాడని చెప్పబడెను. అయజ్ఞుని అనగా యజ్ఞము చేయనివానిని ఇంత కఠినముగ అది శపించుచున్నది. ఇక్కడ యజ్ఞమను మాటకు కాయకష్టము లేదా ఆహారము కొరకు శ్రమ అని అర్థము చెప్పుటయే శోభించును. నా మతము ప్రకారము దానికదే అర్థము వచ్చును. ఏది ఎట్లయినను మా వ్రతమునకు ఇదే మూలము. బుద్ధికూడ మనకిదే మార్గమును చూపించుచున్నది. లేదా ఇదే నియమము నైపు తీసికొనిపోవును. కాయకష్టము చేయనివానికి తినుటకు అధికార మెట్లుండగలదు? 'చెమటోడ్చి రొట్టెను అనగా ఆహారమును సంపాదించుకొని తినుము' అని బైబిలు చెప్పుచున్నది. కోటీశ్వరుడైనను మంచము మీదనే పడియుండి, ఎవ్వరైన నోట్లో అన్నము పెట్టిన తినుచుండినచో— అతను అట్లు చాలరోజులవరకు తినజాలడు. అట్లు తినుటలో అతనికి ఏమాత్ర మానంద ముండబోదు. అందుచేత అతడు శరీర వ్యాయామము చేసి ఆకలిని పుట్టించుకొనును. తినుటకు కూడ అతడు తన చేతులకును నోటికిని పని చెప్పవలసి యుండును.

ఈ విధముగ ఏదో రూపమున రాజు పేద అన్న భేదము లేకుండ అందరును అవయవములను కదలించుట తప్పనిసరి యగునప్పుడు ఆహారోత్పత్తికొరకే అందరు ఎందుకు శ్రమ పడగూడదు ?' అన్న ప్రశ్న వచ్చును. 'వ్యాయామము చేయుము' అనిగాని మంచిగాలి కొరకు ఆరుబైట తిరుగుము' అనిగాని రైతున కెవ్వరు చెప్పరు. ప్రపంచములో నూటికి తొంబదిమందికి వ్యవసాయమే జీవనోపాధిగా ఉన్నది. ఇక మిగిలిన పదిమంది (నూటికి) వారిని అనుకరించినచో ప్రపంచములో ఎంత సుఖము, ఎంత శాంతి, ఎంత ఆరోగ్యము పెంపొందగలదు ? వ్యవసాయపు పనితో బుద్ధికూడ కలిసినచో వ్యవసాయమునకు సంబంధించిన అనేకమైన ఇబ్బందులు సులభముగనే దూరమైపోగలవు. ఇదేగాక, నిరపవాదమైన అనగా అందరకును వర్తించు ఈ కాయకష్ట నియమమును అందరును అంగీకరించి ఆచరణలో పెట్టినచో గొప్ప వారు కొలదివారను భేదము దూరమైపోగలదు. గొప్ప కొలది అన్నవాసన లేనట్టి వర్ణవ్యవస్థలోనికి కూడ ఇప్పుడా భేదభావము చొచ్చుకొనిపోయినది. యజమాని-కార్మికుడు అన్న భేదము సర్వవ్యాపకమైపోయినది. బీదవాడు ధనవంతుని చూచి ఈర్ష్యపడుచున్నాడు. తమ ఆహారము కొరకు అందరును శ్రమపడినచో గొప్ప కొలది అన్న భేదము దూరమైపోగలదు. గొప్పకొలది అన్న వాసన లేనట్టి వర్ణవ్యవస్థలోనికి కూడ ఇప్పుడా భేదభావము చొచ్చుకొనిపోయినది. యజమాని-కార్మికుడు అన్న భేదము సర్వవ్యాపకమైపోయి

నది. బీదవాడు ధనవంతుని చూచి ఈర్ష్యపడుచున్నాడు. తమ ఆహారము కొరకు అందరును శ్రమపడినచో గొప్ప-కొలది అన్న భేదము దూరమైపోవును. ఇక మిగిలిఉండు ధనికవర్గము– తమ వద్దనున్న ధనమునకు తాము యజమానుల మనుకొనక దానికి కేవలము రక్షకులమనిగాని లేదా ట్రస్టీలమని (ధర్మకర్తలమని) గాని– అనుకొని దానిని కేవలము లోకసేవకొరకు ఉపయోగించగలరు. అహింసను పాలించువానికి, సత్యము నారాధించువానికి కాయకష్టము రామబాణమువంటి దగును. వాస్తవముగ విచారించినచో ఈ కాయకష్టము వ్యవసాయమే. కాని నేటి పరిస్థితులలో అందరా పని చేయలేరు. అందుచేత వ్యవసాయవృత్తినే ఆదర్శముగా పెట్టుకొని, దానికి బదులు మనుష్యుడు నూలు వడుకుట, నేతనేయుట, వడ్రంగము, కమ్మరము మొదలగు పనులను చేయవచ్చును. ప్రతివాడును తనకు సంబంధించినంతవరకు పాకీపనిని చేయవలసియే ఉండును. ఆహారమును పుచ్చుకొనువాడు మలవిసర్జన చేయవలసియే ఉండును. మలవిసర్జన చేయువాడే తన మలమును తాను పాతిపెట్టుట అన్నిటికంటె మంచిపని. ఇట్లు చేయుటకు వీలుగానిచో కుటుంబములోని వారందరు కలిసి తమ కర్తవ్యమును పాలింపవలయును. పాకీపనిని ఒక ప్రత్యేక వృత్తిగా చేయుటవల్ల మహాదోష మొకటేదో సంఘములో చొచ్చుకొని పోయినదని అనేక సంవత్సరములనుండి నా కనుపించుచునే ఉన్నది. ఆరోగ్య రక్షణకు అత్యవసరమైన ఈ కార్యమును నీచాతినీచ

మైన పనిగ ఎవరు కావించిరో తెలిసికొనుటకు తగిన చరిత్రాధారములు మనకు లేవు. అట్లు చేసినవాడు మనకు మహోపకారమేదియు చేయలేదు. మనమందరము పాకీవాండ్లమే అను భావన చిన్నతనమునుండి పాతుకొనిపోవలెను. అట్లు పాతుకొనిపోవునట్లు చేయుటకు అతి సులభమైన మార్గమొక్కటే కలదు. ఈ సత్యమును గుర్తెరింగినవారు తాము చేయు కాయకష్టమును పాయిఖానాలను లేక మరుగుదొడ్లను శుభ్రపరచుటతో ప్రారంభించుటయే ఆ మార్గము. జ్ఞానపూర్వకముగ అట్లు చేయువాడు— ఆ క్షణమునుండియే ధర్మమును నిజస్వరూపములో అర్థము చేసికొనగలడు. బాలకులు, వృద్ధులు, రోగమువల్ల అంగవిహీనులైనవారు పరిశ్రమ చేయకున్నచో ఎవ్వరు దానిని అపవాదముక్రింద గైకొనరాదు. బాలకుడు తల్లితో కలిసిపోవును. ప్రకృతి సంబంధమైన నియమములకు భంగము కాకుండినచో వృద్ధులు అంగవిహీనులు ఉండబోరు. ఇక రోగము వచ్చుటకు కారణమేముండగలదు ?

---

## 10
# సర్వధర్మ సమానత్వము I

ఇదివరకు మన వ్రతములలో 'సహిష్ణుత' అన్న పేరుతో ఉన్న వ్రతమునకే ఈ క్రొత్త పేరు పెట్టబడెను. సహిష్ణుత లేక సహనమనునది ఇంగ్లీషు శబ్దమైన 'టాలరెన్సు' (Tolerance) అను దానికి అనువాదము. ఈ మాట నా

కష్టములేకుండెను. కాని అప్పుడు వేరొక్క మాట తోచలేదు. కాకాసాహేబ్‌నకు కూడ ఈ మాట రుచింపలేదు. ఆయన 'సర్వధర్మ ఆదర' మను దానిని కల్పించెను. నాకది కూడ రుచింపలేదు. ఇతర ధర్మములను సహించుటనుటలో ఆ ధర్మములకు న్యూనతను ఆపాదించుట జరుగుచున్నది. ఆదర శబ్దములో దయజూపించు టనే భావమున్నది. అహింస మనలకు ఇతర ధర్మములపట్ల సమభావముంచుట నేర్పుచున్నది. ఆదరము, సహిష్ణుత అను శబ్దములు అహింసాదృష్టితో చూచిన సరిపోవునవికావు. ఇతర ధర్మములయెడ సమభావముంచుటలో తన ధర్మముయొక్క అసంపూర్ణత్వమును అంగీకరించుట కూడ జరుగుచున్నది. సత్యారాధన, అహింసయను ఒరపిడిరాయి ఇదే నేర్పుచున్నది. సంపూర్ణసత్యమును మనము చూడగలిగి యుండినచో సత్యాగ్రహమునకు అనగా సత్యనిష్ఠకు అవసరమేమున్నది? మన భావములో సత్యమే పరమేశ్వరుడు కావున మనమప్పుడు పరమేశ్వరునితో కలసిపోయి యుందుము. పూర్ణసత్యమును మనము కనుగొనలేము. అందుచేతనే సత్యాన్వేషణలో పట్టుదలను చూపించుచున్నాము. దీనిలో పురుషార్థమునకు అవకాశమున్నది. మన అసంపూర్ణత్వమును అంగీకరించినట్లయినది. మనమే అసంపూర్ణులమైనచో మనచే కల్పింపబడిన ధర్మము కూడ అసంపూర్ణమే. స్వతంత్రమైన ధర్మమే సంపూర్ణమైనది. ఈశ్వరుని చూడనట్లే ఆ స్వతంత్ర ధర్మమును కూడ మనము చూడలేము. మనము నమ్మిన ధర్మము అపూర్ణములేక అసం

పూర్ణము. దానిలో సదా పరివర్తన అనగా మార్పు జరుగు చునే ఉండును. ఇక ముందు కూడ జరుగుచునే ఉండగలదు. ఇట్లు జరుగుచుండిననే మనము క్రమక్రమముగా పైకి లేవ గలము. సత్యముదిక్కు, ఈశ్వరునివైపు నానాటికి సాగిపో గలము. మానవులచే కల్పింపబడిన ధర్మములన్నింటిని మను ష్యుడు అసంపూర్ణమైన వానిగ ఎంచుచున్నప్పుడు, గొప్ప కొలది లేదా ఉచ్చనీచభావముండబోదు. ధర్మములన్నియు సత్యములే-అన్నియు అసంపూర్ణములే. అందుచేత అన్నియు కూడ దోషముతో కూడినవే. సమభావమున్నప్పటికిని వాటి లోని దోషములను మనము చూడవచ్చును. మన ధర్మము లోని దోషములను కూడ మనము తెలిసికొనవలెను లేదా చూడవలెను. ఆ దోషములుండుటవల్ల ఆ ధర్మమును మనము వదలిపెట్టరాదు. దానినుండి దోషములను దూరము చేయ వలెను. ఈ ప్రకారము అన్ని ధర్మములపట్ల సమభావముండుట వల్ల ఇతర ధర్మములనుండి గ్రహించవలసిన విషయములను తన ధర్మములోనికి తీసుకొనుటలో సంకోచముండబోదు. అంతేకాదు. అట్లు గ్రహించుట ధర్మముకాగలదు.

అన్ని ధర్మములు ఈశ్వరప్రసాదములే లేక ఈశ్వర దత్తములే. కాని అవి మనుష్యునిచే కల్పింపబడుటవల్ల, మనుష్యునిచే ప్రచారము చేయబడుటవల్ల అసంపూర్ణములు. ఈశ్వర దత్తమైన లేక ఈశ్వరప్రసాదమైన ధర్మము అగమ్య మైనది. అనగా బుద్ధికి కనబడనిది. లేదా దుర్గమమైనది.

దానిని భాషలో లేక మాటలలో మనుష్యుడు ప్రకటించును. దానికి అర్థము కూడ మనుష్యుడే చెప్పును. ఏ మనుష్యుడు చెప్పిన అర్థము నిజమైనది లేక సరియైనదనుకొనవలెను? అన్నియు వాటి వాటి దృష్టినిబట్టి-ఆ దృష్టి ఉన్నంతకాలము సత్యములే. కాని అసత్యములగుట కూడ అసంభవముకాదు. అందుచేత మనకు అన్ని ధర్మములపట్ల సమభావముండ వలెను. ఇందువల్ల మనకు మన ధర్మముపట్ల ఉదాసీనత కలుగదు. దానికి బదులు స్వధర్మమును గురించిన ప్రేమ గ్రుడ్డిదై ఉండక జ్ఞానముతో కూడినదై యుండగలదు. ఎక్కువ సాత్వికము నిర్మలముకాగలదు. అన్ని ధర్మముల యెడల సమభావము కలిగిన తర్వాతనే మన దివ్యచక్షువు తెరిచికొనగలదు. ధర్మాంధతకును దివ్యదర్శనమునకును ఉత్తర దక్షిణధ్రువములకున్నంత దూరమున్నది. ధర్మ జ్ఞానము కల్గుటతోడనే ఆటంకములన్నియు తొలగిపోగలవు. సమభావ ముత్పన్నముకాగలదు. ఈ సమభావము వికసించుట వల్ల మనము మన ధర్మమును బాగుగ తెలిసికొనగలము.

ఇక్కడ ధర్మాధర్మముల మధ్యగల అనగా మంచి చెడుగుల మధ్యగల భేదము పోదు. ఇప్పుడు లోకములో వ్యాపించియున్న వివిధ ధర్మముల (మతముల) విషయమే ఇక్కడ నేను చెప్పుచున్నది. ఈ ధర్మము లన్నింటియొక్క మూలసిద్ధాంతము ఒక్కటే. అన్ని ధర్మములలోన భక్తులగు స్త్రీ పురుషు లెందరో పూర్వముండిరి. ఇప్పుడు కూడ ఉన్నారు. అందుచేత ధర్మముల యెడల సమభావము కలిగి

యుండుటలోనను, వివిధ ధర్మావలంబులైన మనుష్యులపట్ల సమభావ ముండుటలోనను కొంత భేదమున్నది. దుష్టులై నను, శిష్టులైనను, ధార్మికులైనను కాకపోయినను- మనుష్య మాత్రులందు సమభావ ముండవలెను. కాని అధర్మముపట్ల నెన్నటికిని ఉండరాదు.

అట్టియెడ ఇన్ని ధర్మము లుండవలసిన అవసరమే మున్నదన్న ప్రశ్న వచ్చును. ధర్మము లనేకములని మన మెరుంగుదుము. ఆత్మ ఒక్కటే యైనను మనుష్య దేహము లగణితములు. దేహము లసంఖ్యాకములన్న మాట మనము కాదన్నను పోదు. అయినప్పటికిని ఆత్మయొక్క ఏకతను మనము గుర్తించగలము. వృక్షమునకు మూలము ఒక్కటై నట్లే ధర్మమునకు కూడ మూలము ఒక్కటే. కాని ఆ వృక్ష ముయొక్క ఆకులన్నియో అవి అసంఖ్యాకములు- అనగా లెక్కలేనన్ని.



## 11
## సర్వధర్మ సమభావము 2

ఈ విషయము చాల మహాత్మ్యము గలది. అందుచేత దీని విషయమై ఇంకను విస్తారముగ వ్రాయగోరుచున్నాను. నా అనుభవములను కొన్నింటిని వ్రాసినచో సమభావ మను దానియొక్క అర్థము అధిక స్పష్టము కాగలదు. ఇక్కడ వలెనే ఫినిక్సు (దక్షిణాఫ్రికాలోని ఒక స్థలము పేరు) లో

కూడ నిత్యము ప్రార్థన జరుగుచుండెడిది. అక్కడ హిందువులు, ముసల్మానులు, క్రైస్తవులు ఉండిరి. స్వర్గీయుడైన శేఠ్ రుస్తుంజీయో లేక అతని పుత్రుడో- వారిలో ఎవరో ఒకరు తరుచుగ ఉండెడివారు. సేఠ్ రుస్తుంజీ 'మనేవాలుం-వహాలుం దాదా రామజీ నుం నామ్' (నాకు రామనామము ప్రియమైనది) అను పాటన్న చాల ఇష్టపడెడువాడు. మగన్ లాలో లేక కాశీభాయియో ఈ పాటను మా అందరి చేత పాడించుచుండెడివారు. అప్పుడు సేఠ్ రుస్తుంజీ ఉల్లాసముతో 'దాదా రాంజీ'కి బదులు 'దాదా హోర్‌మజ్ద్' పెట్టి పాడమని అడిగెను. పాట పాడించువాడు, పాడెడివారము ఆయన సూచన ప్రకారము, అట్లు పాడుట పూర్తిగ స్వాభావికమైనట్లు వెంటనే పాడసాగితిమి. దీని తర్వాత రుస్తుంజీ ఉన్నప్పుడు తప్పకుండగను, ఆయన లేనప్పుడు కూడ అప్పుడప్పుడును ఆ భజన కీర్తనలో 'దాదా హోరమజ్ద్' పెట్టి పాడుచుండెడివారము. స్వర్గీయుడైన దావూద్ సేఠ్ పుత్రుడైన హుసేన్ ఆశ్రమములో చాల మారులు ఉండెడివాడు. ఆతడు ప్రార్థనలో ఉత్సాహ పూర్వకముగ పాల్గొనుచుండెడివాడు. అతను స్వయముగ, మధుర స్వరములో 'ఆర్గన్' అను వాద్యముతో పాటు "యహ్ బహారె బాగ్- దునియా చాంద్ రోజ్" (ఈ ప్రపంచమను తోట సౌందర్యము కొద్ది రోజులే) అనే భజనను పాడుచుండెడివాడు. మా కందరికిని ఆతడు దానిని నేర్పెను. ప్రార్థనలో అది అనేక మారులు పాడబడుచుండెడిది. ఇక్కడి మా ఆశ్రమ భజనావళిలో

ఆ పాట చేర్చబడినది. ఆ పాట సత్యాగ్రహియైన హుసేనునకు జ్ఞాపక చిహ్నము. అతనికంటె అధిక తత్పరతతో సత్యమును ఆచరించు నవయువకు నింకొకని నేను చూడలేదు. 'జోసెఫ్ రోయసేన్' ఆశ్రమమునకు వచ్చి పోవుచుండెడివాడు. ఆయన క్రైస్తవుడు. ఆయనకు 'వైష్ణవజన' అను భజన కీర్తన అన్న చాల ప్రియము. సంగీతములో ఆయనకు మంచి జ్ఞాన ముండెను. ఆయన 'వైష్ణవ జన్' అనుచోట 'క్రిశ్చియన్ జన్' అను మాటను పెట్టి పాడెను. అందరును వెంటనే ఆయనతో కలిసి అట్లే పాడిరి. 'జోసెఫ్' యొక్క ఆనందమునకు అంతులేకపోయెను.

ఆత్మ తృప్తికొరకు నేను వేరువేరు ధర్మములవారి పవిత్రగ్రంథములను తిరుగవేయునప్పుడు నా కవసరమగునంత వరకు క్రైస్తవుల, ముసల్మానుల, పార్శీల, యహూదుల, (జ్యూ) హిందువుల ధర్మములతో పరిచయము సంపాదించితిని. ఈ పవిత్రగ్రంథముల అధ్యయనము చేయుచున్నప్పుడు అన్ని ధర్మములయెడ నా మనస్సులో సమభావముండినదని నేను చెప్పగలను. అప్పుడు నా కట్టి జ్ఞానమున్నదని నేను చెప్పుట లేదు. అప్పట్ల సమభావశబ్దముతో కూడ నాకు పూర్తి పరిచయ ముండకపోవచ్చును. కాని అప్పటి విషయములను జ్ఞప్తికి తెచ్చికొన్నప్పుడు ఆ ధర్మముల సంబంధములో టీకా టిప్పణి చేయవలెనన్న ఇచ్ఛ కూడ నాకు కలిగినట్లు నాకు జ్ఞాపకము లేదు. దానికి బదులు ఆ ధర్మముల (మతముల)

వారి గ్రంథములను ధర్మగ్రంథములనుకొని ఆదర పూర్వక ముగ చదివితిని. అన్నింటిలో మూలనైతిక సిద్ధాంత మొక్కటిగనే కనుగొంటిని. ఎన్నియో విషయములను నేను అర్థము చేసికొనలేకపోతిని. హిందూ ధర్మగ్రంథముల విషయములో కూడ ఇట్లే అయినది. నేడు కూడ ఎన్నో విషయములను అర్థము చేసికొనలేక పోవుచున్నాను. కాని మనము తెలిసి కొనజాలని వాటిని, తొందరపడి, తప్పులే అని అనుకొనరాదని అనుభవమువల్ల గ్రహింపగల్గితిని. ఇంతకుముందు తెలియరాని విషయములెన్నో నేడు జ్యోతివలె కనబడుచున్నవి. సమభావముతో చూచుట అభ్యాసము చేయుటవల్ల అనేక ముడులు తమంతట అవియే విడిపోవును. మనకు తప్పులే కనబడినప్పుడు వినయవివేకములతో వాటిని చూపించుటవల్ల, ఎవ్వరికిని దుఃఖము కలుగబోదు.

బహుశః ఒక సందేహము రావచ్చును. క్రిందటి మారు వ్రాసినలేఖలో ధర్మమునకు అధర్మమునకు భేదముండునని, అధర్మముపట్ల సమభావమునుంచుకొనునట్లు భ్యాసము చేయవలెనన్నది నా ఉద్దేశము కాదని చెప్పియుంటిని. అట్లయినచో ధర్మాధర్మముల నిర్ణయించుటలో సమభావ నియమమును ఉల్లంఘించుట జరుగుట లేదా యన్న ప్రశ్న రావచ్చును. అంతేగాక ధర్మాధర్మముల నిర్ణయించుటలో కూడ ఆ నిర్ణయించువాడు పొరబడుట కూడ సంభవించవచ్చును. కాని మనలో వాస్తవికమైన అహింస ఉన్నచో

వైరభావము నుండి తప్పించుకొనగలము. అధర్మమును ద్వేషించుచున్నను అది చేయువాని యెడల మనలో ప్రేమ భావ ముండగలదు. దీనివల్ల నాతడు తన తప్పిదమును అంగీకరించుటో లేక మన తప్పిదమును మనకు చూపించుటో లేదా ఒకరి అభిప్రాయముల నొకరు సహించుటో జరుగును. అట్లుగాక ఆతడు అహింసామార్గమునబోక చివరకు హింసకు లేక కఠోరతకు దిగవచ్చును. అప్పటికిని మనము నిజమైన అహింసావాదులమైనచో మన మృదుత్వము ఆతని దౌర్జన్యమును లేక హింసను లేదా కఠోరతను తప్పక దూరముచేయ గలదనుటలో సందేహములేదు. పొరపాటుననైన మనము ఇతరులకు బాధ కలిగించరాదు. స్వయముగ మనమే కష్టములను సహించవలెను. ఈ బంగారు లేక ఉత్తమమైన నియమమును పాలించువాడు అన్ని సంకటములనుండి తప్పించుకొనగలడు.



## 12
# వినయము లేక నమ్రత

వ్రతములలో దీనికి ప్రత్యేకస్థానము లేదు. ఉండ జాలదు కూడ. అహింసకు ఇది ఒక అర్థము. లేదా దీనిని అహింసాంతర్గతమైన దానిగ చెప్పవచ్చును. కాని నమ్రత అభ్యాసమువల్ల లభించజాలదు. అది స్వభావములోనే ఉండ వలెను. ఆశ్రమముయొక్క నియమావళి మొట్టమొదట

తయారు చేయబడినప్పుడు—దాని చిత్తు ప్రతి మిత్రులకు పంప బడెను. సర్ గురుదాస్ బెనర్జీగారు నమ్రతకు వ్రతములలో స్థానమియ్యవలసినదిగ సూచన చేసెను. దానికి వ్రతములలో స్థానమియ్యకుండుటకు అప్పుడు కూడ ఇప్పుడు వ్రాయుచున్న కారణములనే తెలియజేసితిని. దీనికి వ్రతములలో స్థానము లేనప్పటికిని ఇది వ్రతములకంటె ఎక్కువ ఆవశ్యకమైనది. ఆవశ్యకమైనప్పటికిని నమ్రత అభ్యాసమువల్ల ఎవ్వరికిని పట్టు బడదని తెలిసికొంటిమి. సత్యమును అభ్యసించవచ్చును. దయను అభ్యసించవచ్చును. కాని నమ్రత విషయములో దానిని అభ్యసించుట దంభమును అనగా కపటమును అభ్య సించుటని చెప్పవలెను. ఇక్కడ నమ్రత అనగా పెద్దవారు ఒండొరుల గౌరవార్థము శిష్టాచారప్రకారము చేయు పనులు కావు. ఒకడు ఇంకొకనిపట్ల తిరస్కారభావము కలిగియుండియు బైటకు సాష్టాంగ నమస్కారము చేయుచున్నచో అది నమ్రత కాదు. మోసము. ఒకడు రామనామమును జపించుచు, జపమాల త్రిప్పుచు మునివలె కూర్చుండవచ్చును. కాని వాని హృదయము స్వార్థముతో నిండియున్నచో వాడు నమ్రతగలవాడుకాడు. పాషండుడు. వినయశీలునకు తానట్లు న్నట్లు గుర్తుండదు. సత్యము మున్నగు వాటిని కొలుచుటకు మనము కొలబద్దలను పెటుకొనవచ్చును. కాని నమ్రతకు అది వీలులేదు. స్వాభావికమైన నమ్రత లేక వినయము దాగి యుండదు. కాని నమ్రుడైన లేక వినయవంతుడైన మను ష్యుడు ఆ సంగతిని తెలిసికొనలేడు. లేక చూచుకొనలేడు.

వశిష్ఠ విశ్వామిత్రుల ఉదాహరణ విషయమై మన మనేక మారులు ఆశ్రమములో వినియున్నాము. అర్థము చేసి కొన్నాము. మనము శూన్యముతో సమానమగునంతవరకు మన నమ్రత సాగిపోవలెను. 'నేనును ఒకడిని' అన్న అహంకార భూతము మనసులో చేరినంతనే మన నమ్రత ఎగిరిపోగలదు. మన వ్రతములన్నియు మట్టిలో కలిసిపోవును. వ్రతములను పాలించువాడు తానావ్రతములను పాలించుచున్నానని గర్వపడినచో ఆ వ్రతముల విలువను పోగొట్టుకొనును. సమాజములో విషప్రాయుడై పోవును. అతని వ్రతములకు సమాజ మెట్టి విలువనీయదు. వాటి ఫలితమును అతడు అనుభవింపజాలడు. నమ్రతకు అర్థము అహంభావత్వము లేకుండబోవుట. ఆలోచించినచో, జీవమాత్రులమైన మనము విశ్వములోని ఒక రజఃకణముకంటె ఎంతమాత్రము ఎక్కువ కాదు. శరీర రూపములో మనము క్షణమే జీవించువారము. అనంత కాలచక్రములో నూరుసంవత్సరములు ఒక లెక్కలోనివి కావు. అందుచేత మనము అహంకారచక్రమునుండి బైట పడినచో, అనగా మనము శూన్యమైపోయినచో-అంతయు మనమే కాగలము. అంతయు మనమే కాగలమనుదానికి అర్థము ఈశ్వరునితో, పరమాత్మతో సత్యముతో వేరుగ నుండకుండుటయే. అహంకారము నశించుటన్న పరమాత్మునితో కలిసిపోవుట. సముద్రములోనుండు నీటిబిందువు సముద్రముయొక్క మహత్తులో పాల్గొనును. కాని దానికా జ్ఞానముండదు. అది సముద్రమునుండి వేరై 'నేనును ఒకదానిని'

అని చెప్పుకొనుటకు మొదలు పెట్టునో లేదో వెంటనే అది ఎండిపోవును. ఈ జీవితము జల బుద్బుదములతో అనగా నీటిబుడగలతో పోల్చబడినది. అట్లు పోల్చుటలో నాకే మాత్రము అతిశయోక్తి కనుపించుటలేదు.

అట్టి నమ్రత, శూన్యత, అభ్యాసమువల్ల ఎట్లు రాగలదు? కాని వ్రతములను సరియైన రీతిని అర్థము చేసికొనినంతనే నమ్రత తానంత టదే రా మొదలగును. సత్యపాలన చేయగోరువాడు అహంకారిగ ఎట్లుండగలడు? ఇతరుల కొరకు ప్రాణము లర్పింపబోవువాడు ఒక స్థలమును తనదని ఆకట్టుకొని ఎట్లు కూర్చుండగలడు? ప్రాణము లర్పించుటకు నిశ్చయించుకొన్నప్పుడే ఆతను తన శరీరమును వదలివేసినాడు. కాని అట్టి నమ్రతను పురుషార్థ రహితమైనదని అనరా? హిందూ ధర్మములో దానికి అట్టి అర్థమే తప్పక చెప్పబడెను. దీనివల్ల అనేకచోట్ల సోమరితనమునకు, కపటమునకు స్థానము లేక సందు దొరకిపోయినది. వాస్తవములో నమ్రతకు తీవ్రతరమైన పురుషార్థమని అర్థము. కాని అది యంతయు పరమార్థము కొరకే కావలెను. ఈశ్వరుడు ఇరువది నాలుగు గంటలు పనిజేయుచున్నాడు. ఆవలించుటకైనను వ్యవధి తీసికొనడు. మనము ఆయన వారమైనచో, ఆయనలో కలిసిపోయినచో మన ఉద్యోగము కూడ ఆయన దానితో సమానముగ అతంద్రితము అనగా నిద్రలేనిదై పోవును లేదా పోవలెను. సముద్రమునుండి వేరగు నీటి బిందువు విషయములో విశ్రాంతిని మనము భావించవచ్చును.

కాని సముద్రములో నుండు నీటిబిందువునకు విశ్రాంతి ఎక్కడిది? సముద్రమునకు ఒక్క క్షణకాలమైనను విశ్రాంతి ఎక్కడ దొరుకును? మన విషయములో కూడ ఇదేమాట వర్తించును. ఈశ్వర రూప సముద్రములో మనము కలిసి పోయినచో మన విశ్రాంతి ఎగిరిపోవును. విశ్రాంతికి అవసరము కూడ లేకుండగనే పోవుచుండును. ఇదే నిజమైన విశ్రాంతి. మహా అశాంతిలో ఇదే శాంతి. జీవమాత్రులకు సేవగావించుటకై మన సర్వస్వమును అర్పించవలెనన్న ఆశ పెట్టుకొనుటయే నిజమైన నమ్రత. అన్నింటినుండి ముక్తులమైన పిమ్మట లేదా నివృత్తులమైన పిమ్మట మనకు ఆది సోమ శుక్రవారము లన్నియు ఒక్కటే. ఈ అవస్థను లేక స్థితిని వర్ణించుట కష్టము. అది అనుభవగమ్యమైనది. సర్వసమర్పణ గావించినవాడు దాని ననుభవించును. మన మందరము కూడ అనుభవించవచ్చును. దీనిని అనుభవములోనికి తెచ్చికొను ఉద్దేశముతోనే మనము ఆశ్రమములో కూడితిమి. లేక చేరితిమి. వ్రతములన్నియు, పనులన్నియు దీనిని అనుభవించుటకొరకే. ఇక్కడ మన మా వ్రతముల ననుష్టించుచున్నచో ఆ పనులను చేయుచున్నచో ఏదో ఒక రోజున ఆ అనుభవము మన చేజిక్కగలదు. కేవలము దానినే అన్వేషించుచు బోయినచో అది దొరుకునది కాదు.

---

# 13
# స్వదేశీవ్రతము

రాజకీయ విషయముల నెత్తుకొనరాదని నేను చేసి కొన్న సంకల్పమునకు కొంత అడ్డువచ్చును కావున స్వదేశీ విషయము వ్రాయుట మానెదను. స్వదేశీ విషయమై ధార్మిక దృష్టితో వ్రాయ మొదలిడినను రాజకీయములతో పరోక్ష సంబంధముగల కొన్ని సంగతులను వ్రాయవలసివచ్చును.

---

# 14
# స్వదేశీవ్రతము

[ఇది జైలుబైట వ్రాయబడినది.]

స్వదేశీవ్రతము ఈ యుగమునకు సంబంధించిన మహా వ్రతము. అజ్ఞానమువల్లనేమి లేక తదితర కారణములవల్లనేమి ఆత్మకు స్వధర్మజ్ఞానము లేనప్పుడు ఆ జ్ఞానము కలుగుటకు వ్రతములను పాలించుటవసరము కాగలదు. స్వభావమువల్లనే మాంసాహారి కాని వాడు మాంసాహారి కాకుండుటకు వ్రతమును పూనవలసిన అవసరముండదు. మాంసము అతనిని ఆకర్షించుటకు బదులు అతనికి డోకు పుట్టించును.

స్వదేశి ఆత్మయొక్క ధర్మము, కాని అది దానిని మరిచిపోయినది. అందుచేత దాని విషయములో వ్రతమును గైకొనవలసిన అవసరముండును. స్థూలసంబంధములన్నింటి నుండి పూర్తిగ ముక్తిపొందుటయే ఆత్మకు స్వదేశీ అను

దానివల్ల కలుగవలసిన పరమార్థము. ఇతర ఆత్మలతో ఏకతను స్థాపించుకొనుటలో ఆత్మకు దేహము బాధకముగ నుండును. దాని మార్గములో అది విఘ్నరూపమైపోవును. అందుచేత ఆత్మకు దేహము కూడ విదేశియే. జీవమాత్రులతో ఐక్యమును సాధించుచు, స్వదేశీ ధర్మమును ఎరింగి దానిని పాలించువాడు దేహమును కూడ త్యజించివేయును.

ఈ అర్థము సత్యమైనచో మన ఇరుగుపొరుగువారి సేవలో నిమగ్నులమై ఉండుటే స్వదేశీ ధర్మమని ఎట్టి ఆయాసము లేకుండ అర్థము చేసికొనగలము. ఈ సేవ చేయుచున్నపుడు దూరమున నున్నవారు మన సేవనుండి మిగిలిపోవుచున్నారని గాని లేదా వారికి హాని కల్గునని గాని భ్రమ కలుగుట సంభవించవచ్చును. కాని అది కేవలము భ్రమ మాత్రమే. స్వదేశము వారికి పరిశుద్ధమైన సేవ చేయుటవల్ల పరదేశము వారికి కూడ పరిశుద్ధమైన సేవచేయుట తప్పక జరుగును. యథాపిండే తథా బ్రహ్మాండే.

దీనికి విరుద్ధముగ దూరమున నున్నవారి సేవ చేయవలెనన్న మోహముంచుకొన్నచో— ఆ పని జరుగదు సరిగదా ఇరుగుపొరుగువారి సేవకూడ జరుగజాలదు ఇది అది రెండును చెడిపోవును. నా మీద ఆధారపడిన కుటుంబము వారిని లేదా గ్రామవాసులను నేను వదలిపెట్టినచో వారికి నా ఆధారము లేకుండపోవును. దూరమున ఉన్నవారి సేవ చేయుటకు నేను పోయినచో— వారి సేవచేయుట ఎవరి

ధర్మమో వారు ఆ ధర్మమును మరచిపోదురు. అక్కడి వాతావరణము చెడును. నే నున్నచోటి వాతావరణము ఇది వరకే చెడిపోయినది. అట్లు చేయువాడు అన్ని విధముల నష్టమే కలిగించును. అగణితములైన ఇట్టి విషయము లెన్ని టినో దృష్టిలో నుంచుకొన్నచో స్వదేశీ ధర్మమును రుజువు చేయవచ్చును. దీనినుండి "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః" అనునది బయల్వెడలినది. దీనికి స్వదేశీ వ్రత మును పాలించుటలో మరణము సంభవించినను మంచిదేగాని పరదేశీవ్రతము భయానకమైనదని అవశ్యము అర్థము చెప్ప వచ్చును. స్వధర్మ మనగా స్వదేశీ.

స్వదేశీని అర్థము చేసికొనకుండుటవల్లనే గడబిడ జరుగుచున్నది. కుటుంబము యెడల మోహముంచుకొని దానిని నేను పోషించినచో, దానికొరకు ధనమును దొంగి లించుట మున్నగు మోసపు-పనులను జేసినచో అది స్వదేశీ వ్రతపాలనకాదు. కుటుంబముపట్ల నాకున్న ధర్మమునే నేను పాలించవలసినది. ఆ ధర్మమును అన్వేషించుటలోను, దానిని పాలించుటలోను సర్వవ్యాపకమైన ధర్మము నాకు దొరుకును. స్వధర్మమును పాలించుటవల్ల పరధర్మములవారికి లేదా పర ధర్మమునకు హాని ఎన్నడు కలుగజాలదు – కలుగకూడదు. హాని కలిగినచో స్వధర్మమనుకొన్నది స్వధర్మము కాదు, స్వాభిమానము. అందుచేత నది త్యజింప వలసినది.

స్వదేశీని పాలించుటలో కుటుంబమును బలిచేయవలసి వచ్చును. అట్లు చేయవలసివచ్చినచో దానివల్ల కూడ

కుటుంబసేవ జరుగవలెను. తన్ను పోగొట్టుకొని తన్ను రక్షించు కొన్నట్లే కుటుంబమును బోగొట్టుకొని దానిని రక్షించుట సంభవించవచ్చును. నా గ్రామములో మహామారిరోగము వచ్చినదనుకొనుము. అప్పుడారోగము తగిలినవారికి స్వయముగనే సేవచేయుటేగాక ఆ పనికై నా భార్యను, పుత్రీపుత్రులను నేను నియోగించి, వారందరా రోగములవల్ల చనిపోయినచో-నేను కుటుంబము నాశనము చేసినవాడనుగాను. దాని సేవచేసినవాడనే. స్వదేశీలో స్వార్థములేదు. ఒకవేళ ఉన్నను అది శుద్ధస్వార్థము. శుద్ధ స్వార్థమనగా పరమార్థము. శుద్ధస్వదేశీయనగా పరమార్థముయొక్క పరాకాష్ఠ అనగా కడపటి హద్దు.

ఈ విధమైన ఆలోచన ననుసరించి చూడ ఖాదీలో సామాజికమైన లేక సంఘపరమైన శుద్ధ స్వదేశీధర్మము నాకు కనిపించినది లేదా నేను కనుగొంటిని. అందరికిని తెలియ గలట్టి, ఈ యుగములో ఈ దేశములో అందరును పాలించుటత్యంతావశ్యకమైనట్టి స్వదేశీధర్మము ఏది కాగలదు? ఎట్టి ఆయాసము లేకుండ దేనిని పాలించుటవల్ల హిందూస్థానములోని కోట్లకొలది ప్రజలు రక్షింపబడుదురో అట్టి స్వదేశీ ధర్మము ఏది కాగలదు? ఈ ప్రశ్నలకు జవాబుక్రింద రాట్నము లేక స్వదేశి నాకు దొరికినది.

ఈ ధర్మమును పాలించుటవల్ల పరదేశములలోని మిల్లులకు నష్టమువచ్చునని ఎవ్వరును అనుకొనరాదు. దొంగ,

తాను దొంగిలించిన సొమ్మును తిరిగి ఇయ్యవలసివచ్చినచో-లేదా దొంగతనము చేయకుండ దొంగ ఆపివేయబడినచో అందువల్ల ఆ దొంగకు నష్టము కలుగలేదు. లాభమే కలుగుచున్నది. పొరుగువాడు సారా త్రాగుట మానివేసినచో లేదా నల్లమందును తినుట మానివేసినచో దానివల్ల, సారా దుకాణము వానికిగాని నల్లమందు దుకాణమువానికిగాని నష్టము లేదు. లాభమే. యోగ్యముకాని విధమున ధనమును సంపాదించువానికి, ఆ సంపాదన పోయినచో దానివల్ల ఆతనికిని లోకమునకు కూడ లాభమే కల్గును.

రాట్నముమీద ఎట్లో అట్లు ఏదో ఒక రకమైన నూలు వడికి దానితో నేసిన ఖద్దరును కట్టుకొని అందువల్ల స్వదేశీ ధర్మమును పూర్తిగ పాలించితినని తృప్తిపడువారు మహా మోహములో మునిగియున్నారు. సంఘపరమైన స్వదేశీ ధర్మమునకు ఖాదీ మొదటిమెట్టు. ఈ స్వదేశీ ధర్మమునకు ఆఖరి మెట్టులేదు. విదేశవస్తువులతో నిండియున్న ఖద్దరు ధారులు చాలమందియున్నారు. వారు స్వదేశిని పాలించుట లేదు. వారు ఏ యెండకాగొడుకు పట్టువారు లేదా ప్రవాహములో కొట్టుకొని పోవువారు. స్వదేశీవ్రతమును పాలించువాడెప్పుడును తన చుట్టుప్రక్కలను పరిశీలించు చుండును. ఇరుగు పొరుగువారి సేవచేయుట కవకాశము దొరికి నప్పుడెల్ల సేవచేయును. ఇరుగుపొరుగున తనకు ఆవశ్యకమైన వస్తువులు చేతితో తయారుచేయబడినచో మొట్టమొదట ఆ స్వదేశీ వస్తువులంత బాగుండకపోయినను, వాటి ఖరీదు

ఎక్కువైనను ఆతడు వాటినే కొనును. ఆ వస్తువులను పూర్వముకంటె మంచిగ సిద్ధముచేయుటకు, సిద్ధముచేయించుటకు వ్రతధారి ప్రయత్నింపగలడు. అంతేగాని పిరికివాడై స్వదేశీవస్తువులు బాగుండలేదని పరదేశవస్తువుల నుపయోగించుటకు పూనుకొనడు.

అయినను స్వదేశీ ధర్మమును ఎరింగినవాడు నూయి తనదని దానిలో మునిగిపోడు. స్వదేశములో సిద్ధముగాని వస్తువులను లేదా మహా కష్టముమీద తయారగు వస్తువులను పరదేశములమీద ద్వేషముచేత తన దేశములో సిద్ధముచేయించుటకు పూనుకొనుటలో స్వదేశ ధర్మము లేదు. స్వదేశ ధర్మమును పాలించువాడు పరదేశిని ఎన్నటికి ద్వేషించడు. అందుచేత పూర్ణ స్వదేశీ వ్రతములో ఇతరుల ద్వేషించుట ఉండదు. ఇది సంకుచితమైన ధర్మముకాదు. ఇది ప్రేమనుండి, అహింసనుండి జన్మించిన సందరమైన ధర్మము.

---

## 15

## వ్రతముల ఆవశ్యకత

వ్రతముల మహాత్మ్యమును గురించి ఈ ఉత్తరములలోనే నక్కడక్కడ వ్రాసియుండవచ్చును. కాని జీవితమును చక్కగ రూపొందించుకొనుటకు లేదా జీవిత నిర్మాణమునకు వ్రతము లెంత ఆవశ్యకములో ఇక్కడ విచారించుట నా

కుచితమనిపించుచున్నది. వివిధ వ్రతములను గురించి వ్రాసిన పిమ్మట ఇప్పుడా వ్రతముల ఆవశ్యకతను గురించి విచారించుదము.

'నియమములను పాలించుట మంచిదే. కాని వాని విషయములో వ్రతముల గైకొను అవసరము లేదు. అదేగాదు. అట్లు వ్రతముల గైకొనుట మనోదౌర్బల్యమును సూచించును. హానికారకముకూడ కావచ్చును. అంతేగాక వ్రతములను పూనినతర్వాత ఆ వ్రతనియమములు అక్కరలేనివిగను లేదా పాపరూపములైనట్లుగను తెలియవచ్చిన పిమ్మట కూడ వాటిని అంటిపెట్టుకొని ఉండవలసినస్థితి అసహ్యమైనది' అని చెప్పు ఒక సంప్రదాయమున్నది. అది ప్రబలమైనది కూడా. ఇంకను ఆ సంప్రదాయమువారు "ఉదాహరణకు–సారా త్రాగకుండుట మంచిది. అందుచేత త్రాగరాదు. కాని ఎప్పుడైన త్రాగిన నష్టమేమి? మందురూపములో దానిని తప్పక త్రాగవలసినదే. అందుచేత దానిని త్రాగరాదను వ్రతమును గైకొనుట కంఠమున ఉరిపెట్టుకొనుటతో సమానము. సారా విషయములో చెప్పినది ఇతర విషయములకు కూడ వర్తించును. మంచికొరకు అబద్ధముకూడ ఎందుకు చెప్పరాదు? అని కూడ వాదించెదరు. ఈ యుక్తులలో తత్వమేదియును నాకు కనిపించుటలేదు. వ్రతమునకు అర్థము దృఢ నిశ్చయమని. ఆటంకములను దాటిపోవుట కొరకే వ్రతముల ఆవశ్యకత. కష్టములు వచ్చినను భంగము కాని దానినే దృఢ నిశ్చయమనవచ్చును. అట్టి దృఢనిశ్చయము లేనిదే

మనుష్యుడు ఉత్తరోత్తర అభివృద్ధి నందజాలడన్న సంగతిని మానవకోటియొక్క అనుభవము రుజువుచేయుచున్నది. పాప రూపమైన దానిని నిశ్చల వ్రతమని చెప్పుటకు వీలులేదు. అది రాక్షసవృత్తి. మొదట పుణ్యరూపముగనున్న వ్రతము తుదకు పాపరూపముగ సిద్ధమైనచో దానిని వదలిపెట్టుట కూడ ధర్మమే యగును. కాని సందేహాస్పదమైన అట్టి వస్తువు విషయమై ఎవ్వరును వ్రతము బూనరు. లేదా పూన రాదు. మానవకోటిచేత ధర్మములని అంగీకరింపబడినను— వాటిని ఆచరణలో పెట్టుటకు మనము అలవాటుపడని కారణమువల్ల సర్వమాన్యమైన ఆ ధర్మముల విషయముననే మనము వ్రతముల బూనవలసియుండును. పైన ఈయబడిన ఉదాహరణలో పాపమను భ్రమకలుగుట సంభవించవచ్చును సత్యము చెప్పుటవల్ల ఎవరికైన హాని కలిగినచో? అని సత్యవాది విచారించుటకు పూనుకొనడు. సత్యమువల్ల ఈ ప్రపంచములో ఎవ్వరికి హానికలుగదన్న- కలుగజాలదన్న విశ్వాస మాతనికుండవలెను. మద్యపాన విషయములోకూడ ఇదేమాట వర్తించును. ఈ వ్రతము గైకొనునప్పుడు ముందు విషయములో నది వర్తించదని ముందే అనుకొనవలెను లేదా వ్రతపాలనలో ప్రాణాపాయమునకైనను సిద్ధపడుటకు నిశ్చయించుకొనవలెను. మందు రూపములో సారాను త్రాగకున్న శరీరము లేకుండ బోయినచో నష్టమేమి? సారా త్రాగుటచే శరీర ముండునని పట్టా ఎవ్వరు వ్రాసి ఇవ్వగలరు? ఆ సమయములో శరీరమునకు అపాయము లేకుండబోయి

ఇంకొక సమయములో వేరొక కారణమువల్ల శరీరము లేకుండ బోయినచో దానికి బాధ్యులెవ్వరు? దీనికి వ్యతిరేకముగ శరీర రక్షణకొరకు కూడ సారా త్రాగని వాని ఉదాహరణయొక్క అద్భుత ప్రభావము మద్యపాన దుర్వ్యసనములో చిక్కుకొనినవారిమీద పడినచో లోకమునకు ఎంత లాభము! శరీర ముండినను పోయినను సరే ధర్మమును పాలించుటే నా పని అన్న భవ్యమైన నిశ్చయము గావించుకొనినవాడే ఎప్పుడో ఒకప్పుడు ఈశ్వరుని దర్శింపగలడు. వ్రతము బూనుట దుర్బలతకు చిహ్నము కాదు. బలమునకు చిహ్నము. ఫలానా పనిని చేయు టుచితమైనచో దానిని చేసియే తీరవలెను. దీనిపేరే వ్రతము. దీనిలో బలమున్నది. దీనిని వ్రతమని పిలువక ఇంకొక పేరుతో పిలిచినను అభ్యంతరము లేదు. వీలైనంతవరకు చేయగలనను వాడట్లనుటను నమ్రతగ భావించినను నిజమున కతడు తన బలహీనతను లేదా అభిమానమును వెలిబుచ్చుచున్నాడు. దీనిలో నమ్రతాగంధము కూడ లేదు. 'వీలైనంతవరకు' అన్న ఈ మాటలు శుభప్రదములైన నిశ్చయములకు విషముతో సమానములని, నా అనుభవమువల్ల ఇతరుల జీవితములనుండి నేను గ్రహించితిని. వీలైనంతవరకు చేయుట కర్థము మొట్టమొదటి ఆటంకమునకే క్రిందపడుటన్నమాట. వీలైనంతవరకు సత్యమును పాలించెదనన్న వాక్యమున కర్థమేదియు లేదు. వ్యాపారములో వీలైనంతవరకు ఫలానా తారీఖునకు ఫలానా మొత్తము ఇయ్యగలనన్న చిట్టీ చెక్కుగా గాని, హుండీ

రూపములో గాని అంగీకరింపబడదు. అదే విధముగ ఎంత వరకు వీలగునో అంతవరకు సదా సత్యమును పాలించెననను వాని హుండీని భగవంతుని దుకాణములో మార్చుటకు వీలుగాదు.

ఈశ్వరుడు స్వయముగ దృఢనిశ్చయములయొక్క వ్రతములయొక్క సంపూర్ణమైన మూర్తి. తన నియమముల నుండి ఆయన వెంట్రుకవాసంతైన చలించినచో ఆయన ఈశ్వరుడుగ నుండజాలడు. సూర్యుడు మహావ్రతధారి. ఆయనవల్లనే లోకములో కాల నిర్ణయము జరుగును. శుద్ధములగు పంచాంగములను రచించుటకు వీలగుచున్నది. 'ఆయన సదా ఉదయించును. ముందు కూడ ఉదయించుచునే ఉండగలడు.' అన్న దానిలోనే మన క్షేమమున్నదని మన మనుకొనునట్టి మర్యాదను ఆయన స్థాపించి వేసెను. వ్యాపారముకూడ మనుష్యులు తమ వాగ్దానములను నెరవేర్చుట మీదనే ఆధారపడియుండును. వ్యాపారస్థులు ఒండొరులపట్ల వాగ్దానములచే బంధింపబడకుండినచో వ్యాపారమే నడువజాలదు. ఈ విధముగ వ్రతమనునది సర్వత్ర వ్యాపించియుండు వస్తువుగ కనిపించును. అట్టియెడ జీవిత పురోభివృద్ధి కోరువానికి, ఈశ్వరదర్శనము గావించగోరువానికి వ్రతములు లేకుండ పని ఎట్లు జరుగగలదు ? అందుచేత వ్రతముల ఆవశ్యకతను గురించి మన మనస్సులలో సందేహ మెన్నడు పుట్టరాదు.

---

# 16

# యజ్ఞము

యజ్ఞమను మాటను మనము తరచు ఉపయోగించెదము. రాట్నముమీద నూలు వడకు పనిని మనము మహాయజ్ఞమని చెప్పుచున్నాము. అందుచేత యజ్ఞమను మాట యొక్క వివిధార్థములను గురించి విచారించు టవసరము.

యజ్ఞ మన, ఇహపరలోకములకు సంబంధించిన స్వార్థమును పెట్టుకొనక, ఇతరుల శ్రేయస్సుకోరి చేయు కర్మ లేక పని. ఇక్కడ కర్మ లేక పని అను శబ్దములను విశాలార్థములో తీసికొనవలసియుండును. మనోవాక్కాయములకు సంబంధించిన కర్మ దానిలో ఇమిడియున్నది. ఇతరు లనుమాట మానవమాత్రులకేగాక సకల ప్రాణకోటికిని వర్తించును. అందుచేత అహింసాదృష్టితో చూచినచో మానవాభ్యుదయమునకై కూడ జంతుబలినిచ్చుట యజ్ఞముకాదు. జంతుబలిని వేదములు అంగీకరించుచున్నవన్నను బాధలేదు. అట్టి బలి సత్యమునకును అహింసకును విరుద్ధమగుటయేచాలును. నేను వేద పండితుడను గానని ఒప్పుకొందును. ఈ విషయములో నాకట్టి పాండిత్యము లేనందులకు బాధపడను. వేదకాలమునాటి సంఘములో జంతుబలి ఉండినదని ఋజువు చేసినను, చేయబడినను అహింసావాది కది ప్రమాణము కాజాలదు.

యజ్ఞమనునది ఒక కర్మ లేక పని కావలెను. అది అత్యధిక భూభాగములో నివసించు, అత్యధిక సంఖ్యాకులైన

జనులకు, అత్యధిక శ్రేయస్సును కలిగించునదై ఉండవలెను. అంతియకాదు. అకర్మ, తక్కువ శ్రమతో అత్యధిక సంఖ్యాకులైన స్త్రీపురుషులు చేయుటకు వీలైనదిగ ఉండవలెను. అందుచేత, ఉత్తమ లక్ష్యమనబడుదానిని సాధించుటకైనను ఎవరికైన చెడు గోరుటగాని చెడు చేయుటగాని యజ్ఞము కాజాలదు. మహాయజ్ఞ మెంతమాత్రము కాజాలదు. యజ్ఞము క్రిందకురాని కర్మ అంతయు బంధనమునకే కారణమగునని గీత బోధించుచున్నది. అనుభవము కూడ అదే తెలుపుచున్నది.

ఈ యర్థములో యజ్ఞము లేకుండ ప్రపంచము ఒక్కక్షణమైన ఉండజాలదు. అందుచేతనే గీత రెండవ అధ్యాయములో జ్ఞానమును గురించి చెప్పి, దానిని బడయుసాధనముల విషయమై మూడవ అధ్యాయములో నెత్తుకొని సృష్టితోడనే యజ్ఞము మొదలైనదని చెప్పుచున్నది. సృష్టికంతకును సేవచేయుటకే ఈ శరీరము మనకీయబడినది. అందుచేత యజ్ఞము చేయకుండ భుజించువాడు దొంగిలించిన ఆహారమును తినుచున్నాడని గీత చెప్పుచున్నది. పవిత్రజీవితమును గడపగోరువాని ప్రతి కర్మయు యజ్ఞరూపమై ఉండవలెను. యజ్ఞము చేయవలసిన విధి మనకు జన్మవల్లనే వచ్చిపడినది. అందుచేత బ్రతికియున్నంత కాలము మనము ఋణస్థులమే. సదా లోకసేవ చేయవలసినవారమే. బానిస తన యజమాని నుండి తిండి, బట్ట మొదలగు వానిని బడయునట్లు విశ్వనాథుడు మనకిచ్చువానిని కృతజ్ఞతతో దానము క్రింద మనము

తీసికొనవలెను. ఋణస్థులమైన మనము మన విధులను నెర వేర్చినందులకు ప్రతిఫలమందుటకు అనర్హుల మగుదుము. అందుచేత మనము గ్రహించుదానిని దానమే యనవలెను. కావున దానము లభింపకపోయినచో మనము యజమానిని నిందింపరాదు. మన శరీర మాయనదే. దానిని జాగ్రత్తగ నుంచుకొనుటయో లేక వదలివేయుటయో ఆయన ఆజ్ఞ ప్రకారమే జరుగును. ఈ విషయమై మనమెవ్వరిని నిందింప రాదు. దయను యాచించరాదు. దానికి బదులు ఈశ్వర సృష్టిలో మన స్థానమేదో గ్రహించినచో ఇది ఆనందదాయక మైనది. వాంఛనీయమైనది. ఈ బ్రహ్మానంద మనుభవించ వలెనన్నచో మనకు గట్టి నమ్మకముండవలెను. 'నిన్ను గురించి నీవేమాత్రము చింతపెట్టుకొనకుము. ఆ చింత పర మేశ్వరునకే వదలుము' అన్న దానినే అన్ని ధర్మములు చెప్పుచున్నవి.

దీనివల్ల ఎవ్వరును భయభ్రాంతులు కానవసరములేదు. పరిశుద్ధమైన అంతరాత్మతో సేవనే పనిగా పెట్టుకొన్నవాడు దీని ఆవశ్యకతను ఆ రోజుకంటె ఆ రోజు బాగుగ గ్రహింప గలడు. అతని భక్తివిశ్వాసములు నానాటికిని వృద్ధి బొంద గలవు. స్వార్థత్యాగము చేయుటకు సిద్ధముకాని వాడు, జన్మతః తనకు సంక్రమించిన విధులను గుర్తెరుంగనివాడు సేవామార్గమునం దడుగిడలేడు. తెలిసియో, తెలియకయో మనలో ప్రతి వారును ఏదో ఒక విధమైన సేవ చేయు చున్నారు. ఈ అలవాటును మనము బుద్ధిపూర్వకముగ

అభ్యాసము చేసినచో సేవచేయవలెనన్న కోరిక మనలో నానాటికిని ఎక్కువ కాగలదు. దానివల్ల మనకే గాక యావత్ప్రపంచమునకు సౌఖ్యము చేకూరును.

---

## 17
## యజ్ఞము

క్రిందటి వారము యజ్ఞమును గురించి వ్రాసితిని. ఆ విషయమై ఇంకను వ్రాయవలెనని యున్నది. మానవ సృష్టితోపాటు సృష్టింపబడిన నియమమును గురించి వ్రాయుట లాభసాటిగనే ఉండుననుకొనెదను. యజ్ఞము ఇరువదినాలుగు గంటలు నెరవేర్చవలసిన ఒక విధి లేక చేయవలసిన ఒక సేవ. అందుచేత 'పరోపకారాయ సతాంవిభూతయః' అను వాక్యమునందలి ఉపకార శబ్దములో కరుణభావము ఏ మాత్ర మున్నను ఆ వాక్యము సరికాదు. కోరికలేకుండ సేవచేయుట ఇతరులయెడ దయజూపించుటకాదు. మన సేవ చేసికొనుటయే. ఋణము తీర్చుటవల్ల మనకే లాభము కలుగును. మన తలమీది బరువు తగ్గిపోవును. నిర్వర్తించవలసిన విధిని నిర్వర్తించినట్లగును. సత్పురుషులేగాక, మనమందరముకూడ మన సాధన సంపత్తులను మానవాభ్యుదయమునకై వినియోగింపవలసి యుండును. పరమేశ్వరుని శాసన మది అగుచో (అదేనని స్పష్టముగా తెలియుచున్నది) భోగలాలసతకు జీవితములో స్థానములేకుండ బోయి త్యాగమునకు దారి నిచ్చును. త్యాగమే మానవునకును పశువునకును గల భేదము.

అట్టి జీవితములో రసముండదనియు, కళకును గృహస్థ జీవితమునకును దానిలో చోటుండదనియు కొందరు అభ్యంతరము చెప్పెదురు. త్యాగమనగా ఇక్కడ ప్రపంచమును వదలిపెట్టి అడవులకు పోవుటకాదు. జీవితములో చేయవలసిన కర్మలన్నింటిని త్యాగబుద్ధితోనే చేయవలెననుట. జీవితము భోగము లనుభవించుటకు గాక ధర్మమును నిర్వర్తించుటకే నని భావించు గృహస్థుడు, గృహస్థుడు కాకుండపోడు. త్యాగబుద్ధితో పనిచేయు వర్తకుని చేతిలో కోట్లు తిరుగుచుండును. అతడు తన శక్తులనన్నింటిని సేవకొరకే ఉపయోగించును. అందుచేత ఆతను మోసము చేయడు. సాహసవ్యాపారములోనికి దిగడు లేదా జూదమాడడు. స్వచ్ఛమైన జీవితమును గడపును. ఏ ప్రాణికిని హాని చేయడు. ఎవరికైన హాని చేయుటకంటె కోట్లకొలది ధనమును పోగొట్టుకొనుటకు సిద్ధపడును. ఇట్టి వర్తకులు నా ఊహాజగత్తులోనే ఉన్నారని ఎవ్వరును భ్రమపడరాదు. ప్రపంచముయొక్క సౌభాగ్యమువల్ల అట్టివారు ప్రాచ్యదేశములలోను పాశ్చాత్య దేశములలో కూడ ఉన్నారు. అట్టి వారిని వ్రేళ్లమీద లెక్కింపవచ్చునన్నది కూడ నిజమే. కాని పై వర్ణనకు తగిన సజీవుడైన వర్తకుడు ఒక్కడున్నను నేను చెప్పినది ఊహాకల్పితమనుటకు వీలులేదు. వధవాణములోని లోకసేవా తత్పరుడైన దర్జీవానిని మనమందర మెరుగుదుము. అట్టి వానినే మంగలినొకనిని నేను ఎరుంగుదును. మనలో ప్రతివారును అట్టి నేతగాని నొక్కని ఎరుగుదురు. ఈ విషయములో లోతునకు

పోయినచో భగవదర్పితమైన జీవితములను గడపువారు ప్రతి వృత్తిలోనను మనకు కనబడగలరు. వీరు తమ వృత్తివల్లనే జీవనోపాధిని సంపాదించుకొందురన్న మాట సత్యమే. జీవనోపాధిని సంపాదించుటయే వారు చేయుపనికి ముఖ్యోద్దేశము కాదు. మోతీలాల్ మొట్టమొదట దర్జీ అనగా కుట్టు పనివాడు. తర్వాతకూడ కుట్టుపనివాడుగనే ఉండెను. అతని భావములో మార్పు వచ్చినది. అతను చేయు పని పూజక్రింద పరిణమించినది. అతను ఇతరుల క్షేమమును గురించి ఆలోచింపసాగెను. అతని జీవితమప్పటినుండి నిజమైన అర్థములో కళామయమైపోయినది. త్యాగముతో కూడిన జీవితము కళాసౌధమునకు శిఖరమువంటిది. వాస్తవమైన ఆనందముతో నిండినది. ఒక మహాభారముగా గాని చికాకు కల్గించుదానిగా గాని భావించుచు చేయు యజ్ఞము యజ్ఞముకాదు. భోగలాలసత లేక స్వార్థపరత్వము నాశనమునకు దారి తీయును. త్యాగము అమృతత్వమునకు తీసికొనిపోవును. ఆనందమునకు స్వతంత్రమైన ఉనికి లేక అస్తిత్వములేదు. జీవితముపట్ల మనకున్న దృక్పథముమీద అది ఆధారపడియుండును. ఒకడు నాటకములలోని దృశ్యములను చూచి ఆనందించును. ఇంకొకడు క్షణక్షణమునకు మారుచుండు ఆకాశ దృశ్యములను గాంచి ఆనందించును. అందుచేత ఆనందమనునది ఒక వ్యక్తియొక్క విద్యమీద, ఆతడు చెందిన జాతియందు ప్రచారములోనున్న విద్యమీద ఆధారపడి యుండును. ఏ వస్తువులను చూచి ఆనందించుటకు చిన్నప్పుడు మనకు

శిక్షణ యొసంగబడినదో ఆ వస్తువులను చూచియే మనము ఆనందించెదము. వివిధజాతులవారి రుచులను దెల్పు ఉదాహరణలనెన్నింటినో సులభముగ నీయవచ్చును.

త్యాగులనేకమంది-తాము నిష్కామమైన సేవ చేయుచుండుటచే ప్రజలనుండి తమ కవసరమైన వస్తువులనే గాక, తమ కవసరములేని వస్తువులనెన్నింటినో కూడ పుచ్చుకొనవచ్చుననుకొందురు. సేవ చేయువాడు ఇట్టి భావములకు లోనైనంతనే ఆతడు సేవ చేయువానిగ ఉండజాలడు. నిరంకుశుడై పోవును. లేదా ప్రజలను బాధించు క్రూరుడై పోవును.

సేవ చేయుగోరువాడు తన సుఖము విషయమై ఆలోచించుకొనుటలో కాలము వృథాచేయడు. అన్నింటికిని పరమేశ్వరుడే ఉన్నాడని నమ్మి ఉండును. అందుచేత దారిలో దొరికిన దానినెల్ల ముందుముందు అవసరము కావచ్చునని నెత్తిని వేసికొనడు. తనకు మిక్కిలి అనవసరమగుదానినే తీసికొని మిగిలినవానిని వదలిపెట్టును. అసౌఖ్యము కల్గుచున్నను ఆతడు శాంతుడై యుండును. కోపించడు. మనోనిబ్బరమును పోగొట్టుకొనడు. సద్గుణములకు ప్రతిఫలము సద్గుణములే యగునట్లు అతని సేవకు ప్రతిఫలము సేవయే. దానితోనే ఆతడు తృప్తిపడి ఉండును.

సేవ చేయువాడు అజాగ్రత్తగను, నిర్లక్ష్యముగను ఉండరాదు. అవసరమును దాటిపోనీయరాదు. తన సొంత వ్యవహారములలోనే కష్టపడి పనిచేయవలయుననియు, ప్రతి

ఫలములేని ప్రజాహితజీవితములోని పనులను తనకు ఇష్టము వచ్చినట్లు ఏదోవిధముగ చేయవచ్చుననియు అనుకొనువాడు త్యాగమనెడి శాస్త్రమును గురించి మామూలు విషయములే ఇంకను నేర్చుకొనవలసియుండును. ఇతరుల సేవ చేయుటకు బుద్ధిపూర్వకముగ పూనుకొనువాడు తన సర్వశక్తులను అందులకు వినియోగింపవలెను. తన స్వార్థమునకుగాక దానికే ముందు ప్రాధాన్యత నీయవలసియుండును. వాస్తవమేమన నిజమైన భక్తుడు ఎట్టి సంకోచములేకుండ మానవసేవకు తన్నంకితము చేసివైచుకొనును.



తెలుగులోనికి అనువదింపబడిన

## గాంధీజీ రచనలు

1. ఢిల్లీ దినచర్య
2. నా మతము
3. మన గ్రామ పునర్నిర్మాణము
4. నూతన విద్యా విధానము
5. అంటు దిస్ లాస్ట్ (సర్వోదయము)
6. సర్వోదయము
7. నవీన విద్యాపథంలో
8. నిర్మాణ కార్యక్రమము
9. పంచాయతీ రాజ్యము
10. సహకార సేద్యము
11. యరోడా జైలునుండి

## అచ్చులోనున్నవి

12. అస్పృశ్యతా నివారణ కార్యకర్తలకు
13. అహింసాత్మక సామ్యవాదము
14. శాంతి సమరములలో అహింసా సిద్ధాంతము
15. ఆశ్రమదీక్షలు, నియమములు

గాంధీ సాహిత్య ప్రచురణాలయము
(గాంధీ స్మారకనిధి, ఆంధ్రశాఖ)
రామారావుపేట, కాకినాడ.